బాల సాహిత్యం:



# విప్లవ జ్యోతి

# శ్రీ అల్లూరి సీతారామరాజు

బుఱ్ఱకథ



"ఈ బొందిలో ప్రాణ మన్నది పోతే ఒకనాడే
పోతుంది - చరిత్ర అన్నది నిత్యం నిలుస్తుంది"

— ఝాన్సీ లక్ష్మీబాయి.



కూర్పు:

పి. దుర్గారావు, యం. ఓ. యల్.

రక్తాక్షి నామ సంవత్సరము
వసంత ఋతువు - వైశాఖము
1984 మే





ప్రథమ ముద్రణము 500 ప్రతులు

మూల్యము :
మూడు రూపాయలు.



ముఖచిత్రము యం. రాము.

ముద్రణ :
"వెంకటరత్నా" విజయవాడ.

ప్రతులకు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్.
చెఱుకుపల్లి పోస్టు.
వయా నక్రేకల్, నల్లగొండజిల్లా.

# జో హా రు లు !

"శ్రీ రామరాజుయొక్క అకుంఠిత సాహసము, త్యాగదీక్ష, ఏకాగ్రత, సచ్ఛీలము మనమందఱము నేర్చుకొనతగినవి. నేను సాయుధ విప్లవాన్ని ఆమోదించలేను. కాని శ్రీ రామరాజువంటి ధైర్యవంతుడు, త్యాగి, నిరాడంబరుడు, ఉత్తమశీలుడు నగు యువకునికి జోహారులు అర్పింపకుండ నుండలేను."

—గాంధిజీ

(యంగ్ ఇండియా పత్రిక 1926)

# జోహారులు !

అమరవీరు లందఱికీ జోహారులు !
ఆత్మార్పణ యోధులకూ నివాళులు !

దేశ దాస్య శృంఖలములు ఛేదింపగా!
దేశ ప్రజల దాస్యమును తొలగింపగా!
అసువుల తృణప్రాయముగా ధారవోసినా
అఖిల దేశభక్తులకు జోహారులు !

స్వేచ్ఛా స్వాతంత్ర్యములు జన్మహక్కనీ
శ్వేతజాతి పాలనమును శిథిల పరుపగా
అడుగడుగున రక్తమొలికి ధరణి కొఱిగినా
అజ్ఞాతపు యోధులకు నివాళులు !

వీరఖడ్గములను దాల్చి ధీరవనితలై
పరదేశపు పీడకులను పారద్రోలగా!
కదనములో కదము ద్రొక్కి యసువులొదిలినా
క్రాంతి వీరనారులకు జోహారులు !

వీరా యడుగుల జాడలలో మేము నడిచెదం!
వీరా యాశయసిద్ధికొఱకు మేము పోరెదం!
సమసమాజ స్థాపనకై సాగిపోయెదం!
స్వాతంత్ర్యపు జ్యోతినెపుడు కాపాడెదం!

అమరవీరు లందఱికీ జోహారులు!
ఆత్మార్పణ యోధులకు నివాళులు!

# వినయ వాక్యము

చాలకాలము క్రిందట ఈ బుఱ్ఱకథను రావులపెంట ఉన్నత పాఠశాల విద్యార్థులు ప్రదర్శించుటకొఱకు వ్రాయబడినది. దానినే కొంచెము విస్తృతపరచి, బాలలందఱికి ఉపయోగార్థము ప్రకటించుచున్నాను.

బుఱ్ఱకథలనగా బాలలకెంత ఇష్టమో చెప్పనవసరము లేదు. ఇదివఱలో భారతకోకిల సరోజినీదేవి, నవయుగ నిర్మాత శ్రీ కందుకూరి, వీరనారీమణి ఝాన్సీలక్ష్మీబాయి జీవితములను చిన్న చిన్న బుఱ్ఱకథలుగా ప్రకటించితిని. ప్రస్తుతము విప్లవవీరుడు శ్రీ అల్లూరి సీతారామరాజు వీర గాథను వెలువరించుచున్నాను.

శ్రీయుత పడాల రామారావుగారు వ్రాసిన ఆంధ్రశ్రీ మున్నగు ఇతర గ్రంథములను ఆధారముగా జేసికొని యీ బుఱ్ఱకథను సమకూర్చితిని. వారికి సదా కృతజ్ఞుడను.

శ్రీ అల్లూరి వీరగాథను అనేకమంది కథలుగను, నాటకములుగను, వీరచిత్రాభినయములుగను రచించిరి. మహాపురుషులను గుఱించియు, మహావీరులను గుఱించియు మఱల మఱల మాటిమాటికి స్మరింపవలసియుండును గదా!

శ్రీ సీతారామరాజు ఆంగ్లేయులకు దొఱికిపోవుట యందును, ఆ వీరుని కాల్చివేయుటయందును కొన్ని కొన్ని పుస్తకములలో వేఱు వేఱుగ వివరింపబడి యున్నది.

కొన్ని పుస్తకములయందు శ్రీ అల్లూరి కాశ్రయమిచ్చిన శ్రీ చిటికెల భాస్కరరావుగారి సలహా ననుసరించి ఆంగ్ల సేనాని గుడాలువద్దకు బోవుటయు, అతడు శ్రీ రాజును మోసముతో బంధించి కాల్చివేయుట గలదు.

శ్రీ పడాల రామారావుగారు రచించిన 'ఆంధ్రశ్రీ' యందు శ్రీ రాజు రక్తసిక్తమైన తన దేహమును ముంప యేటిలో కడిగికొని సంధ్యార్కునికి అర్ఘ్యమిస్తున్న సమయంలో అస్సాం సైన్యమునకు తెలిసి, శ్రీ రాజును బంధించి చెట్టునకు కట్టి కాల్చివేసినట్లు గలదు.

ఈ బుఱ్ఱకథయందు శ్రీ రాజు శ్రీ భాస్కరరావుగారి సలహాను విని ఒకక్షణము చలించినట్లును, తరువాత తండ్రి పలికిన మాటలు జ్ఞప్తికి వచ్చి ఆంగ్లేయులతో పోరాడుటకే నిశ్చయించినట్లును కల్పించితిని. తుదకు రక్తసిక్తమైన దేహమును ముంప నదిలో కడిగికొని సంధ్యార్కునికి అర్ఘ్యమిచ్చు సమయమున అస్సాం సైన్యము చుట్టుముట్టినట్లును, ఆంగ్ల సేనాని గుడాలు వద్దకు తీసుకుపోయిరనియు, గుడాలు శ్రీ రాజును చెట్టునకు కట్టి కాల్చివేసెననియు ఈ బుఱ్ఱకథ యందు గలదు.

ఇందు దోషములున్న విషయజ్ఞులు తెలియజేసిన దిద్దుకొందును.

— ర చ యి త

# విప్లవ జ్యోతి

# శ్రీ అల్లూరి సీతారామరాజు

## బుర్ర కథ

అంబవైనా నీవేనమ్మా భారతాంబా!—జగ
దాంబవైనా నీవేనమ్మా భారతాంబా! ...అంబ

అరువది కోట్లా భారతీయులము భారతాంబా!
ఆరని భక్తి భజించెదమమ్మా భారతాంబా! ...అంబ

ఐకమత్యము సిరిసంపదలు—భారతాంబా!
అలరునట్లు మమ్మాశీర్వదించుము! భారతాంబా ...అంబ

ఇంటా-బయటా శాంతి యశస్సులు భారతాంబా!
ఇంపుగనిచ్చి కాపాడుమమ్మా భారతాంబా! ...అంబ

అంబవైనా నీవేనమ్మా-భారతాంబా!—జగ
దాంబవైనా నీవేనమ్మా-భారతాంబా! ...అంబ

జయము జయము మన భారతభూమికి జయము దిగ్విజయము
జయము జయము మన మాతృభూమికీ జయము దిగ్విజయము
జయము జయము మన అమరవీరులకు జయము దిగ్విజయము
జయము జయము మన జాతినేతలకు జయము దిగ్విజయము

వంత : ఏరా అన్నయ్యా! ఇంతమందిజనాన్ని యిచ్చట కూర్చొబెట్టి, విసిగించకుండా నీవు చెప్పబోయే కథయేదో త్వరగా చెప్పరా! ఇంతకు నీవు చెప్పబోయే కథ ఏమిటిరా?

కథకుడు: అంతెత్తోందరపడతావెందుకురా తమ్ముడూ? భారత స్వాతంత్ర్య సమరంలో ఎత్తోమంది వీర యువకులు ఆంగ్ల సామ్రాజ్యవాదులతో పోరాడి అసువుల నర్పించారు. తెలుగుగడ్డపై కూడ ఎత్తోమంది యువకులు సామ్రాజ్యవాదులతో పోరాడి, మాతృదేశ స్వాతంత్ర్యానికై ప్రాణాలర్పించారు. అట్టివారిలో మణిపూస విప్లవవీరుడు శ్రీ అల్లూరి సీతారామరాజు. ఆ మహావీరుని మహనీయ చరిత్రను కథగా చెప్పుకుందాంరా తమ్ముడూ!

వంత: నీవు చెప్పబోయే కథ శ్రీ అల్లూరి సీతారామరాజు కథ అన్నమాట! నీవు చెప్పబోయే కథ నాకెంతో ఇష్టం! అందరు శ్రద్ధగా వింటున్నారు చెప్పరా త్వరగా! ఆ విప్లవ వీరుని కథను వినాలని మాకందరికీ యెంతో కుతూహలంగా వుంది.

కథకుడు: శ్రీ అల్లూరి కథను చెప్పుకునేముందు భారత దేశంలో ఆంగ్లేయులు ఏవిధంగా ప్రవేశించింది, మనలను ఎలా బానిసత్వంలో ముంచింది, మన స్వాతంత్ర్యోద్యమం పుట్టుపూర్వోత్తరాలను గురించి కొద్దిగా తెలుసుకుందాము తమ్ముడూ!

వంత: అలాగే అన్నయ్యా! నేను కాదంటానా?

కథకుడు :- అయితే వినరా తమ్ముడూ!

వినరా భారత వీరకుమారా!- విజయము మనదేరా!
జ్ఞానజ్యోతి మన భారతదేశము - జగతికి దీపము రా
శుభ్రధవళ హిమాలయ మున్న - సుందర దేశము రా
గంగా యమునా గోదావరులు - కదిలే దేశము రా

అవతారములకు పుట్టినిల్లురా - అపర స్వర్గభూమి
ధర్మభూమి యిది పుణ్యభూమిరా—కర్మభూమి వినరా
సిరి సంపదలకు పాడిపంటలకు—శ్రీలకు నిలయమురా
రత్నగర్భయను నామ మొందెరా—రమ్యతరముగాను
అన్నపూర్ణ యను నామ మొందెరా—అఖిల దేశములను
ఎందరెందరో మహానుభావులు - ఇచట నుద్భవించి
భారతదేశపు కీర్తి చంద్రికల - పరగవ్యాప్తి చేసి
స్వర్ణభారతిగ తీర్చిదిద్దిరి - సర్వజగతి పొగడ

ఈ విధంగా మన దేశం సిరిసందలతో, పాడిపంట లతో తులతూగుతూ వుండడం చూచి, పరదేశీయుల కండ్లు మెరమెర లాడినవి. అదివరకు గ్రీకులు, హూణులు, శకులు, పహ్లావులు మొగలులు మనదేశంపై దాడి చేశారు. వారి నందరినీ మన భారత యోధులు తిప్పికొట్టారు. దాడి చేసిన వారందరు పరాజితులై తిరిగిపోవడమో లేదా నశించడమో జరిగింది. అంతేగాదు, కొందరు ఇచ్చటే స్థిరపడి పోయి, మనజాతిలో, మన సంస్కృతిలో అంతర్భాగమవడం కూడా జరిగింది.

వంత :- అయితే మన భారత వీరులు అంతటి మహా పరాక్రమవంతు లంటావు.

కథకుడు :- అవునురా తమ్ముడూ!

వంత :- అయితే మరి యీ ఇంగ్లీషువారు మన దేశాన్ని ఆనాడు ఎట్లా ఆక్రమించుకున్నారురా అన్నయ్యా!

కథకుడు :- వినరా తమ్ముడూ!

భళా భళానోయ్ తమ్ముడా! సై భాయిభళానోయ్ దాదానా!

పదునేడవ శతాబ్దిరా ||సై||
పడవలపై నే వచ్చిరి "
బుడుత కీచులే వచ్చిరి "
పూని ఫ్రెంచివారొచ్చిరి "
వాణిజ్యమనే వంకబెట్టుకొని "
వచ్చిరి ఆంగ్లేయ వంచకులూ ||భళా||
నెత్తిన టోపీ పెట్టుక ||సై||
మెత్తని మాటలు నత్తుచు "
ఒకచే త్రాసును బట్టుక "
ఒకచే కత్తిని బట్టుక "
ఈస్టు-ఇండియా కంపెని అంటు
ఇంగ్లీషు వారే వచ్చారు ||భళా||

ఇంగ్లీషు వారు ఈస్టిండియా కంపెనీ పేరుతో మన దేశంలో వ్యాపార కేంద్రాలు పెట్టారు. రక్షణకనే సాకుతో సైన్యాన్ని సమకూర్చుకున్నారు. దురదృష్టవశాత్తు ఇంగ్లీషు వారు ఆ విధంగా సైన్యాన్ని మనదేశంలో సమకూర్చుకుంటున్నప్పుడు మన రాజులు చూస్తూ ఊరుకున్నారు. ఆనాడు మన దేశ పరిస్థితి ఎలా ఉన్నదంటే-

వంత :- ఎలా ఉన్నది అన్నయ్యా!

కధకుడు :- వినరా భారతవీరకుమారా విజయము మనదేరా!
చిన్న చిన్న రాజ్యములను దేశము - చీలియుండె వినరా!
మొగల్ రాజ్యము నామమాత్రమయి - మోడువారిపోయె
మతకుల భేదములను మనదేశము-మసలుచుండె వినరా

ఐకమత్యము లేక జనులలో - అలజడులను మునిగె
సుఖలాలసులై రాజభోగముల—సోలిరి భూపతులు
రాజులు తమలో తామే పోరుచు—రగులుచుండె అగ్ని
పోరు నష్టము పొందులాభమును—పూనికమరిచారు
పరదేశీయుల దాడులెదుర్కొను—పటుతరమైనట్టి
ప్రజాశక్తిని సమీకరించే - ప్రభుత్వమే లేదు!

విదేశీయులైన పోర్చుగీసు, ఫ్రెంచివారికన్న ఇంగ్లీషు వారు మిక్కిలి క్రూరులు, కుటిలాత్ములు. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టే కృతఘ్నులు. మన అనైక్యతను, చీలికలను, అసమర్థతను గమనించారు. మన భారతదేశాన్ని ఆక్రమించుటకు, మన సిరిసంపదలు దోచుకొనుటకు కుట్రలు పన్నసాగారు. ఈస్టిండియా కంపెనీ పేరుతో వాణిజ్యమునకై వచ్చిన ఆంగ్లేయులు క్రీ.శ. 1683 సంIIలో ఇంగ్లండు ప్రభుత్వం నుండి భారతదేశంలో సేనను సమకూర్చుకొనడానికి, భారత దేశాన్ని జయించడానికి విశేషాధికారాలను పొందారు. తరువాత ఏం జరిగిదంటే -

వంత :- ఏం జరిగిందన్నయ్యా?

కథకుడు : తంధానా—తంధానా భా మా దేవనంపనానా
భారతదేశము నాక్రమింపగా—తంధానా తంధాన తంధానా
పన్నాగములే పన్నిరి దొరలు ,,
కుటిల రక్కసులు క్రూరచిత్తులు ,,
కుట్రలు వేగ పన్న సాగిరి ,,
భారత ప్రజలను అణచివేయుటకు ,,
భారత సేనను తయారు చేసిరి ,,
తుపాకి ఫిరంగి అశ్వీక దళముల తులువలు నిర్మించి!

తంధానా—తంధాన భాయి దేవసంపనాన!
చీలికలను మతిసాకు జేసికొని తంధానా తంధాన తంపనా
చీలీయ సాగిరి మన రాజులు ”
ఒకరినొకరిపై - నెగద్రోయుదురు ”
ఒకరి నైపునా-కలిచి పోరుదురు ”
బుజ్జగించెదరు-ఇరు రాజ్యములను ”
కజ్జబెట్టుదురు-ఇరు రాజ్యములకు ”
తెల్ల రక్కసులు చేసిరి దేశము వల్లకాడుగాను!
తంధానా—తంధాన భాయి దేవ సంపనానా!

ఈ విధంగా ఆంగ్లేయులు కుటిల నీతితో క్రూరమైన ఎత్తుగడలతో మన భారతదేశాన్ని క్రమక్రమంగా ఆక్రమించసాగారు. ఒక రాజ్యం తరువాత ఒక రాజ్యం, ఒక ప్రాంతం తరువాత ఒక ప్రాంతం ఆక్రమించసాగారు.

క్రీ. శ. 1805 నాటికి భారతదేశపు తూర్పు ప్రాంతాన్నంతటినీ ఆక్రమించుకున్నారు. తక్కిన దేశాన్ని కూడ అదే కుటిలనీతితో ఆక్రమణ చేయడం మొదలుపెట్టారు.

పంజాబులో రంజిత్ సింగ్ ఓడిపోయాడు. మైసూరులో టిప్పు సుల్తాను పరాజయంపొందాడు. ఆఖరి మొగల్ రాజయిన బహదూర్ షా ఇంగ్లీషువారి చెప్పుచేతల్లో నామమాత్రానశిష్టుడైన రాజుగా ఢిల్లీ గద్దెపై కూర్చున్నాడు.

దేశంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యములు మృగ్యమైనవి. ఆంగ్లేయులు క్రూరశాసనాలు అమలుజరిపి ప్రజలను నానా బాధలు పెడుతున్నారు. కఠినమైన నిర్బంధ విధానం అమలు జరిపారు. మన భారతీయ సైన్యంతోనే భారత ప్రజలను

అణచివేయసాగారు. తెల్లదొరల చారలజెండా ఎక్కడ చూచినా ఎగురుతూ ఉంది. దేశంలో శాంతి అనేది అస్త మించింది.

తంధానా - తంధానాభాయి దేవనందనానా

ఆంగ్లేయులపై భారతీయుల తంధానా తంధాన తందనా
ఆక్రోశములే మిన్నుముట్టినవి ,,
స్వేచ్ఛా, స్వాతంత్ర్యములు హరించిన ,,
సిరిసంపదలు హరించుచున్న ,,
తెల్లదొరల దుండగములు మానుప ,,
దేశప్రజలను సంరక్షింపగ ,,
భారతప్రజలే ముందుకొచ్చిరి పగతుర నెదిరింపా
తంధానా—తంధాన బాయి దేవనందనానా!

బుసలు కొట్టెడి నాగుబాములా తంధానా తంధాన తందనా
పొగిలే అగ్నిపర్వతంబులా ,,
కెరటాల్ చిందే సముద్రంబులా ,,
గిర గిర తిరిగే సుడిగుండములా ,,
మిల మిల మెరిసే మెఱుపు తీగెలుగ ,,
ఫెళ ఫెళ ఉరిమే ఉఱుములవలె ప్రజ పెల్లున లేచారు!
తంధానా-తంధానా బాయి దేవ నందనానా

ఆ రగులుతున్న జ్వాలలే చారిత్రాత్మకమైన ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం. ఆ ప్రజా విప్లవాన్ని 'సిపాయి తిరుగుబాటు'ని ఆంగ్లేయులు దారుణంగా అణచివేశారు.

నానాసాహెబు, ఝాన్సీరాణి, తాంత్యాతోపే, మంగల్ పాండ్యా, రంగోబాపు, ఫిరోజ్ షా ... షేర్ ఖాన్ మున్నగు వీర

యోధులు గాక, వేలాది స్వాతంత్ర్య సమరయోధులు మాతృదేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం తమ ప్రాణా లర్పిస్తారు.

అయినప్పటికి ఆంగ్లేయులు ఆ ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని సైనిక తిరుగుబాటుగా చిత్రించి, దారుణంగా అణచివేస్తారు. భారతదేశంపై చీకటి తెరలు అలుముకున్నవి. ఆంగ్లేయ రక్కసులు విచ్చుకత్తులతో విలయతాండవం చేస్తారు. భారతమాత పరదేశీయుల దాస్య శృంఖలాలతో బంధించబడినది. ఈస్టిండియా కంపెనీ రద్దయి యింగ్లాండు రాణి అధికారాన్ని స్వీకరిస్తుంది.

అయినా ఆ వీరుల బలిదానం వ్యర్థంకాలేదు. వారు రగిలించిన చిచ్చే నాలుకలు చాచుకొని రెండవ భారత స్వాతంత్ర్య సంగ్రామంగా వెల్లివిరిసింది.

వారు రగిలించిన జ్వాలలే 1947 సంవత్సరము ఆగస్టు 15వ తేదీన ఆంగ్లేయులకు భారతదేశం నుండి తరలిపోవలసిన గతి పట్టింది.

వర్తకానికి వచ్చిన యింగ్లీషువారు ఈ విధంగా మన చీలికలను, అనైక్యతను ఆధారంగా జేసికొని, మన భారత భూమిని ఆసేతు హిమాచల ప్రాంతాన్ని ఆక్రమించారు. మన ప్రజలను బానిసలుగ జేశారు. ఇచ్చటి సంపదల నన్నింటిని కొల్లగొట్టారు. మన చీలికలను, అనైక్యతను మరింతగా పెంపొందించారు. దేశాన్ని దారిద్ర్యానికి కేంద్రంగా జేశారు. అట్టి తరుణంలో—

వంత : ఏం జరిగింది అన్నయ్యా?

కథకుడు: వినరా తమ్ముడా!

తంధానా-తంధానా ఓయి దేవనందనానా!

తంధానా తంధాన తందనా

దేశభక్తులు ముందుకొచ్చిరీ ,,

దేశప్రజల మేల్కొలుపసాగిరీ! ,,

పరదేశీయుల వెడలనంపగా ,,

పరప్రభుత్వమును సాగనంపగా ,,

భారత భూమికి జయమని పలుకుచు ,,

భారత ప్రజలకు జయమని పలుకుచు ,,

మాతృదేశ స్వాతంత్ర్య సాధనకు మరలుకొనిరి ప్రజలూ!

తంధానా-తంధానా ఓయి దేవనందనానా!

కాంగ్రెసు సంస్థను స్థాపించిరిగా తంధానా తంధాన తందనా

కదిలిరి వీరులు స్వాతంత్ర్య యోధులు ,,

తిలకు గోఖలే-దాసూ బోసూ ,,

తెలిపిరి జాతికి నవ ప్రబోధములు! ,,

స్వాతంత్ర్యము మన జన్మహక్కనుచు ,,

స్వారాజ్యము మన జాతి హక్కనుచు ,,

క్రాంతి భావముల వ్యాప్తిజేసిరీ కదిలె దేశమంతా

తంధానా-తంధానా ఓయి దేవనందనానా!

గాంధీజీ నేతృత్వము క్రిందా ,,

కలిగెను జాతికి త్యాగ శౌర్యములు ,,

జాతిప్రజలు వే నిదుర లేచిరీ ,,

జాతీయోద్యమము నడువసాగెను ,,

సత్యాహింసల శాంతి సమరము ,,

విప్లవ జ్యోతిని వెలిగించారు వేల కాంతులొలుకగా!
తంధానా_తంధానా బాయి దేవనందనానా!
కఠిన కర్కశులు_కాల రక్కసులు ”
కాలులు పేలుచు_కఠినత్వముతో ”
దేశభక్తులను_దేశసేవికల ”
ధీర యువకులను_ధీర యోధులను ”
నిర్బంధించుచు_నీరస పరచుచు ”
ఉరిశిక్షలతో_ఉక్కు చట్టముల ”
పాశవికమునగు పశుబలములతో పరవళ్ళు ద్రొక్కారు!
తందానా_తందానా బాయి దేవనందనానా!

అట్టి సమయములో గాంధీజీ నాయకత్వము క్రింద స్వాతంత్ర్యోద్యమము జరుగుతున్నప్పటికీ, ఆ విధంగా సత్యాహింసల శాంతి సమరం వలన క్రూరులైన ఇంగ్లీషు వారు మనకు స్వాతంత్ర్యం ఇవ్వరనీ, సాయుధంగా మనం పోరాడి రక్తమొలికినప్పుడే తక్షణ స్వాతంత్ర్యం మనం పొందగలమని ఉడుకురక్తం గల వీర యువకులు సాయుధంగానైనా పోరాడి, ఇంగ్లీషువారి నెదిరించి పారద్రోలి, స్వాతంత్ర్యము సంపాదించాలని నిశ్చయించారు. అట్టివారి కోవకు చెందినవాడే మన శ్రీ అల్లూరి సీతారామ రాజు! మన్యంలో ఈ పోరాటం జరిగింది.

## శ్రీ సీతారామరాజు పరిచయం

విశాఖపట్టణంలో సుభాష్‌చంద్రబోసు ఉపన్యాసం ద్వారా స్వాతంత్ర్య దీక్షా కంకణ బద్ధుడై శ్రీ రాజు చదువుకు స్వస్తిచెప్పి, స్వాతంత్ర్య సంగ్రామంలో దూకాడు.

భారత రాజకీయాలలో గాంధీజీ ప్రవేశించుటకు ముందు ఒక సంవత్సరం కాలం దేశమంతా పర్యటన గావించి భారత దర్శనం చేసుకొన్నారు. అదే విధంగా శ్రీ రాజు కూడ స్వాతంత్ర్య సంగ్రామములో చేరుటకు ముందు దేశమంతా పర్యటన గావించాడు. దేశ ప్రజల హీనస్థితిని, బానిసత్వాన్ని ప్రత్యక్షంగా తిలకించాడు, సామ్రాజ్య వాదుల ప్రభుత్వ పరిపాలనను కూడ గాంచాడు.

1918 లో ప్రపంచ యుద్ధము సమాప్తి చెందినది. యుద్ధ విజయానంతరం స్వాతంత్ర్యం బ్రిటీషువారు ఇస్తారనే ఆశలు నిరాశ లయ్యాయి!

పైగా స్వాతంత్ర్యోద్యమాలు రౌలటు ఆక్టు, తీవ్ర నిర్బంధాలు, జలియన్ వాలా బాగు హత్యలు, అయ్యరు సేనాని దురంతాలు, ఇవన్నీ మన రామరాజు మనస్సు కలచి వేసినవి.

తన కర్తవ్యాన్ని గురించి ఒక సంవత్సర కాలం మౌనంగా ఆలోచించ ప్రారంభించాడు. ప్రజలకు, దేశానికి ఏ విధంగా సేవ చేయాలో ఆలోచించసాగాడు.

తన జన్మస్థానమైన తూర్పుగోదావరి జిల్లాకు సమీపమునగల మన్య ప్రాంతములో ఒక దేవాలయములో సన్యాసి జీవితం మొదలు పెట్టాడు! భారతదేశాన్ని గురించి, భారత ప్రజలను గురించి, ఆ స్థితులను గురించి, వారి దారుణ నిర్బంధాలను గురించి తీవ్రంగా మథన పడ్డాడు.

ప్రస్తుత దుర్భర దారిద్ర్యానికి పరదేశీయుల పాలనే కారణమని గ్రహించాడు! బానిస భారత దేశం ఏమీ సాధించ

జాలదని గ్రహించాడు! సామ్రాజ్యవాదులను భారత దేశం నుండి తరిమి వేయుటే సర్వ వ్యాధులకు తగిన చికిత్సయని నిశ్చయించుకున్నాడు.

ఆనాడు గాంధీజీ నాయకత్వము క్రింద జరుగుతున్న జాతీయోద్యమము వలన ప్రజలలో చైతన్యము, స్వాతంత్ర్యేచ్ఛ కలుగుతున్నప్పటికీ స్వాతంత్ర్యము వచ్చుటకు చాల కాలము పడుతుందని భావించాడు సామ్రాజ్యవాదుల హింసా దౌర్జన్యాలను ఎదిరించాలని అతని యువ హృదయం, ఉడుకు రక్తం ఆటు పోటులు ఒకేసారి ఎగసిన సముద్ర ఘోషవలె ఘూర్ణిల్లినది.

రష్యాలో జారుపతనం — నూతన సూర్యోదయం శ్రీరాజులో నూతన కాంతులు, ఆశలు ప్రజ్వరిల్లినవి.

అంతర్మథనంతో హోరులెత్తుతున్న హృదయాన్ని శాంతింప జేసికొని కృష్ణదేవు పేటలో నున్న నీలకంఠేశ్వ రాలయంలో మౌనముద్ర వహించి తన కర్తవ్యాన్ని గురించి ఆలోచింప సాగాడు.

ఆ కర్మ వీరునికి కర్తవ్యం గోచరించింది. కాఱు చీకటిలో కాంతిరేఖ కనిపించింది. అంతర్మథనంతో తన కర్తవ్యాన్ని గురించి ఆలోచిస్తున్న ఆ వీరునికి తన యెదుట మన్యప్రాంతంలో ఆంగ్లేయుల ఘోర పైశాచిక కృత్యాలు కనబడినవి.

అజ్ఞానులైన కోయ ప్రజలు పడుతున్న దీనావస్థలను కనులార తిలకించాడు. మానవునిగా తన కర్తవ్యాన్ని ఆలో

చించాడు. దారుణ దౌర్జన్యానికి గురి అవుతున్న కోయ ప్రజలకు అండగా నిలవాలని నిర్ణయించుకున్నాడు.

తన పోరాటం కేవలం కోయ ప్రజల దురవస్థలను రూపు మాపడమే గాక తన మాతృభూమి బానిసత్వాన్ని రూపు మాపడానికి కూడా తోడ్పడుతుందని భావించాడు.

అయితే రవి యస్తమించని బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఈ కొద్దిమంది కోయ ప్రజల సహాయంతో నిర్మూలించ గలనా యని ప్రశ్నించుకున్నాడు. దేశమంతా అన్ని ప్రాంతాలలో సాయుధ పోరాటం జరిగినప్పుడే - ప్రభుత్వాన్ని నవరంధ్రాలు బిగించజేసే చైతన్య వంతమైన కార్మిక వర్గం ముందు నిలిచినప్పుడే ఏ విప్లవమైనా విజయ వంత మవుతుందని శ్రీ రాజుకు తెలుసు.

కాని — ఆ సూచనలు సుదూర భవిష్యత్తులో, శ్రీ రాజుకు ఎక్కడా కనిపించడం లేదు. ఈ పరిస్థితులలో తన కర్తవ్యమేమిటో రాజు నిర్ణయించుకున్నాడు.

మాతృదేశ స్వాతంత్ర్యానికై, నిరంకుశత్వ నిర్మూల నకై, అన్యాయానికి, అసత్యానికి, దౌర్జన్యానికి వ్యతిరే కంగా పోరాడి తన ప్రాణాలను మాతృదేశ శ్రీచరణముల యందు బలి గావించడానికి నిశ్చయించుకున్నాడు. మనిషిగా మరణించి వీరునిగా జన్మించాలని కలలు గన్నాడు.

అంతేగాదు, శ్రీ రాజు వ్యక్తిగత హింసా వాదాన్ని స్వీకరించలేదు. ఆంగ్లేయులను హత్య చేయడమే తన ధ్యేయ ముగా భావించలేదు.

ఏ శక్తులు భారతదేశాన్ని పీల్చి పిప్పి చేస్తున్నాయో, ఏ సామ్రాజ్యవాద శక్తులు భారత ప్రజల్ని దాస్య శృంఖలాలలో బంధించి అవమానిస్తున్నవో, ఏ స్వార్థశక్తులు భారతదేశ సిరిసంపదలను దోచుకుంటున్నవో ఆ శక్తులను అంతం చేయాలని నిశ్చయించుకున్నాడు. ఆ పైశాచిక శక్తులను నిర్మూలించాలని నిర్ణయించుకున్నాడు. ఆ నిర్దాక్షిణ్య శక్తులతో ఢీకొని పోరాడాలని ప్రతిజ్ఞ చేశాడు. ఆ సామ్రాజ్యవాద అనాగరిక శక్తులతో బహిరంగంగాను, రహస్యంగాను పోరాడి చావుదెబ్బ కొట్టాలని నిశ్చయాని కొచ్చాడు.

ఈ చావు బ్రతుకుల పోరాటంలో, ఈ పెనుతుఫాను ప్రయాణంలో తనకు మృత్యువు తప్పదని శ్రీ రాజుకు తెలుసు. మాతృదేశ స్వాతంత్ర్యం కొరకు, దేశప్రజల సుఖ సౌఖ్యాలకొరకు మృత్యువును సంతోషంతో — చిరునవ్వుతో కౌగలించుకోవాలని స్థిర నిర్ణయాని కొచ్చాడు.

తనను ఒక విప్లవవహ్నిగా భావించాడు. ఆ విప్లవవహ్ని రాజుకొని జ్వాలగా ప్రజ్వరిల్లాలని ఆశించాడు. ఆ జ్వాలా తోరణం జాతికి వెలుగునివ్వాలని, దేశానికి తేజస్సునివ్వాలని, యువకులకు ఆదర్శం కావాలని, పరదేశీయులను దహించి వేయాలని ఆశించాడు.

పరదేశీయులతో జరిగే పోరాటంలో శ్రీ రాజు తనను ఒక సమిధగా అర్పించుకోవాలనీ, దేశమాత శ్రీ చరణాలకు ఒక పూజాపుష్పంగా తనను అర్పించుకోవాలని నిశ్చయానికొచ్చాడురా తమ్ముడూ!

చల్లకదలనీ — చల్లని బ్రతుకు! ”
ఎల్లారే ఎల్లల్లపిల్లా! ఎల్లారే ఎల్లల్లపిల్లా!

ఇట్లా ఆడుతూ పాడుతూ జీవిస్తూ వుండేవారురా తమ్ముడూ! ఇంకా యెట్లా జీవిస్తూ వుండేవారంటే-

ఎల్లారే ఎల్లల్లపిల్లా - ఎల్లారే ఎల్లల్లపిల్లా!
చెట్టుపుట్టల్లో - సక్కీ సొక్కీ ”
చేరి పురుగు పిట్ట - పట్టికొట్టి ”
వెదురు బియ్యము - విప్పపువ్వులు ”
కాయ కసరులు - కంప గడ్డలు ”
చిక్కుడు గింజలు - చిక్కని తేనెలు ”
విల్లమ్ములతో - విచ్చు కత్తులను ”
ఎగిరి పట్టినా - పులుగుల మాంసం ”
ఎగసి చంపినా - ఏదుల మాంసం ”
హాయిగ తింటు - హాయి చరించే ”
ఆంగిలేయుల - ఆగమనముతో ”
అగచాట్లొచ్చెర - ఆ కోయులకు ”
ఎల్లారే ఎల్లల్లపిల్లా - ఎల్లారే ఎల్లల్లపిల్లా

ఇట్టి మన్య ప్రాంతంలో ఆంగిలేయులు ప్రవేశించి ఏం చేశారో వినరా తమ్ముడూ!

వంత: ఏం చేశారు అన్నయ్యా?

కథకుడు: తందానా-తందానా భాయిదేవనందనానా!
మన్యము జొరబడి తెల్లదొరవుడు తందానా తందానతనానా!
మడిమాన్యములను వశము జేసికొని ”
మన్య సంపదలు అపహరించుటకు ”

లను ముఠాదార్లు కప్పగించారు! పాపమూ కోయప్రజలంతా భూములు లేని కూలీలుగా మారిపోయారు!

అంతేగాక అందచందాలు గల కోయవారికి, పెత్తన పనులిచ్చి, కోయవారిపై కోయవారిచే దౌర్జన్యాలు చేయించ మొదలుపెట్టారు

వంత: అయ్యో పాపం! తరువాత యేం జరిగిందిరా తమ్ముడూ!

కథకుడు: ఆ దిక్కులేని, అమాయకులైన కోయజాతి వారి కష్టాలను తొలగించడానికి నడుముకట్టి ముందుకు వచ్చాడురా ఒక మహావీరుడు. అతడే మన శ్రీ అల్లూరి సీతారామరాజు.

వంత: అరే అన్నయ్యా! ఈ సీతారామరాజు ఎవరో తల్లిదండ్రులెవరో యే విధంగా కోయ ప్రజలకు నాయకత్వం వహించి, ఆంగ్ల ప్రభుత్వాన్ని యెదుర్కొన్నాడో వివరంగా చెప్పరా అన్నయ్యా?

కథకుడు :-

వినరా భారత వీరకుమారా విజయము మనదేరా!
వినరా విప్లవ వీరుని గాథను—వీనుల విందుగను!
వినరా సీతారామరాజు కథ—వేయి చెవులతోడా!
మన్యం వీరుని మరపురాని కథ—మహిమాన్వితమిదిరా!
తెలుగు గడ్డకు కీర్తిదెచ్చినా—ధీరుని కథ యిదిరా!
తెలుగు పౌరుషము కోన కోనకు—తెలిపిన వాడతడు!
తెలుగు శౌర్యమును జగతి కంతటికి—తెలిపిన వాడతడు
ఆంధ్ర తేజమును అన్ని దిక్కులకు—అందజేసె నతడు

ఒకసారి రాజు తండ్రితో షికారుకు వెళుతున్న సమయంలో ఒక ఆంగ్లేయుడు కొరడాను అటు యిటు అదిలించుకుంటూ గుఱ్ఱపుస్వారీ చేస్తూ వస్తున్నాడు. ఆ సమయంలో రాజు ఆ ఆంగ్లేయునికి నమస్కరించాడట! వెంటనే రాజు చెంపమీద ఛెళ్ళున చెంపదెబ్బ పడ్డది!

ఇంగ్లీషువారు మన సంపదలను హరించి మనలను పరిపాలిస్తున్నారనీ, వారికి నమస్కరింపకూడదనీ, ఎవరికీ తల వొంపకూడదని కుమారునికి తండ్రి వేంకట రామరాజు గారు వీరరసాన్ని నూరిపోశారు తండ్రి నూరిపోసిన వీరరసాన్ని రాజు భావి జీవితంలో అడుగడుగునా ఆచరించాడు.

అంతేగాదు; బాల్యంలో నీటిలో మునిగిపోతున్న బాలుణ్ణి రామరాజు రక్షించాడు. ఆ బాలుని తల్లిదండ్రులు శ్రీ వేంకట రామరాజుగారికి ధన్యవాదాలర్పించడానికి వచ్చినప్పుడు ఆయన కన్నులలో ఆనందబాష్పాలు వొలికినవట!

దురదృష్టవశాత్తు రాజుకు ఎనిమిదేళ్ళ ప్రాయంలో తండ్రిగారు అస్తమించారు.

వంత : అయ్యో పాపం! తరువాత ఏం జరిగింది అన్నయ్యా?

కథకుడు: పినతండ్రి శ్రీ రామకృష్ణంరాజు ఈ కుటుంబాన్ని తాను నివసిస్తున్న నరసాపురానికి తీసికొని వచ్చి ఆదరించాడు! సీతారామరాజు అచ్చటనే హైస్కూల్ ఉన్నత పాఠశాలలో జేరి చదువుకునేవాడు! కాని తండ్రి గతించినప్పటి నుండి రాజులో ఏకాగ్రత, మౌనం ఆవహించినవి.

ఇరువురు ఒకచోట చేరి పాఠాలు చదువుకుంటూ దేశభక్తుల చరిత్రలు చదివేవారు. ఒకనాడు కాకినాడ సముద్రతీరంలో రాజుకు ఆంగ్ల విద్యార్థులతో తగవు రావడం, కాకినాడ కాలేజీనుండి రాజుకు ఉద్వాసన జరిగింది.

వంత: పాపం! రాజుకు చిన్నప్పటినుండి ఎన్ని కష్టాలు!

కథకుడు: వీరులెప్పుడూ కష్టాలను లెక్క చేయరురా తమ్ముడూ! వానిని పరీక్షలుగా భావించి ఎదుర్కొంటారు!

తరువాత శ్రీ రాజు తిన్నగా తుని చేరి అచ్చట బంధువుల యింట్లో వుంటూ అచ్చటి కాలేజీలో చదువుకుంటున్నాడు. కొద్ది కాలానికి అచ్చట బంధువుల తిరస్కృతి యెదురయింది.

వంత: అయ్యో! పాపం! తరువాత?

కథకుడు: అచ్చటి నుండి కోట నందూరు వచ్చి, సంస్కృత పాఠశాలలో జేరాడు. కాని సంస్కృతం అతనికి వంటబట్ట లేదు. కాని ఆ సమయంలో రాజు జీవితంలో ఒక నూతన ఘట్టం ప్రారంభమయింది.

కోటనందూరు సమీపాన గల మన్యపు అడవులలో పేద ప్రజల బాధలు, కష్టజీవుల కష్టాలు కనులారా గాంచడం జరిగింది. అతని హృదయం ద్రవించింది. అతని హృదయంలో సత్యం ఉదయించింది. ధనికుల సంపదలన్నీ దరిద్రుల శ్రమ ఫలితమేనని తెలుసుకున్నాడు. ధర్మం కోసం తపనపడే తన హృదయాన్ని ప్రజలకోసం అర్పించాలనే ప్రగాఢవాంఛ శ్రీ రాజులో కలిగింది.

ఆంగ్లేయులను ఎదిరించుటకు ఆంగ్ల విద్య నేర్చుకొనుట అవసరమని భావించి, సంస్కృతవిద్యకు స్వస్తిచెప్పి శ్రీ రాజు విశాఖపట్నం చేరుకున్నాడు. తల్లి దగ్గర నుండి కొద్దిగా డబ్బు తెప్పించుకొని విశాఖపట్నం ఏ. వి. యన్. కాలేజిలో చేరాడు.

కాని రాజుకు చదువుమీద కంటె స్వేచ్ఛా స్వాతంత్ర్యముల మీద మక్కువ మిక్కుటమైనది. దేశదాస్య నిర్మూలనకు కృషి చేయాలనే ప్రగాఢ వాంఛ అతనిలో మొలకెత్తింది.

కాలి నడకను విశాఖపట్టణ వీధుల్లో తిరిగాడు. దుర్గంధ భూయిష్టములైన మురికి వాడలను, పేదల నివాసములను గాంచాడు. వారి కష్టాలను, కన్నీటి వాగులను తిలకించాడు. లోకం బాధను తన బాధగా భావించాడు. లోకాన్ని తన కుటుంబంగా ఎంచుకున్నాడు. ఆంగ్ల సామ్రాజ్యంపై తిరుగుబాటుకు అతని హృదయం అట్టులు చాచింది

ఆ సమయంలోనే సీత అనే అమ్మాయి కాలేజీలో సహాధ్యాయిని. రాజు రూప గుణశీలములను జూచి వివాహమాడ నిశ్చయించింది. ఆమె తండ్రి కూడ అంగీకరించాడు.

కాని రాజు స్వాతంత్ర్య సమరంలో స్త్రీ ప్రేమ గడ్డి పోచ వంటిదని నిర్ణయించి తన వృద్దేశాన్ని సీతకు తెలియ పరిచాడు.

సీత అతని ఉన్నతాశయమునకు హర్షించి తన బొటన వ్రేలి నెత్తుటితో వీరతిలకం దిద్దుతుంది మగువ మాంచాలకు వలె శ్రీ రాజుకు సీత ఎంతో ఉత్సాహం కలిగిస్తుంది. అతని అడుగు జాడలలో నడవడానికి నిశ్చయించుకుంటుంది.

ఆ సమయంలో శ్రీ సుభాష్‌చంద్రబోసు విశాఖపట్ట ణానికి వచ్చి వుపన్యసిస్తాడు. బోసు ఉపన్యాసం రాజుమీద ఎంతో ప్రభావాన్ని కలిగించింది.

భారత స్వాతంత్ర్యానికై ప్రాణాలర్పించడానికి ఎవ్వరైనా సిద్ధమేనా? అతే ముందుకు రమ్మని సభలో గర్జించాడు. నేను సిద్ధమని రాజు ముందు కొచ్చాడు. బోసు అతనికి పూలమాల వేసి గౌరవిస్తాడు.

వంత : తరువాత ఏం జరిగింది అన్నయ్యా ?

కథకుడు: శ్రీ రాజు చదువుకున్నస్తిచెప్పాడు. 'మేడమ్ కామా' వీరసావర్కారులకు జన్మభూమి అయిన బొంబాయి చేరుకున్నాడు.

అచ్చటి నుండి పడమటి కొండల నుండి వింధ్య పర్వతాల మీదుగా పంజాబు చేరుకున్నాడు. గదర్ వీరుల సాహచర్యాన్ని సంపాదించాడు. బెంగాల్ విప్లవకారులను గూడ శ్రీ రాజు కలుసుకున్నాడు.

ఆ విప్లవ వీరుల ప్రభావం రాజు మీద పడ్డది. తాను కూడ తాను పుట్టిన తెనుగు గడ్డమీది నుండి ఆంగ్లేయులతో పోరాడాలని నిశ్చయించుకున్నాడు. వీరావేశంలో తాను పుట్టిన తెలుగు నేలకు చేరుకున్నాడు.

మన్యానికి సింహద్వారమైన కృష్ణదేవుపేట నీలకంఠేశ్వరాలయంలో శ్రీ రాజు ప్రత్యక్షమయ్యాడు. కమండలం, కోదండం, కాషాయ వస్త్రాలు గీతా ప్రవచనములతో తన రాజకీయ జీవితాన్ని ప్రారంభించాడు తమ్ముడూ! శ్రీ చిటికెల భాస్కరరావుగారు అతనికి ఆశ్రయమిచ్చారు.

ఆ కాలంలో గూడెం తాలూకాకు బాప్టియన్ అనే ఒక క్రిష్టియన్ తహసీల్దారు. అతడు మిక్కిలి క్రూరుడు. అతడు అమాయకులైన కోయలను నానా హింసలు పెడుతుండేవాడు, ఏ విధంగా అంటే

ఆంగ్లేయులతో మిత్రుడు బాప్టియనూ తంధానో
అమాయకులు ఆ కోయ ప్రజలనంతా ”
నానా బాధల ముంచివేసినాడు ”
నానా అగచాట్లులపాలు చేసే ”
భూములన్నిటిని లాగివేసినాడు ”
ముఠాదార్లకు అప్పగించినాడు ”
కంచెలు వేసీ సర్వే చేయించే ”
కాయ కసరులు ఏరుట తప్పనెను ”
... చాకిరిని కట్టడి చేయించే ”
వట్టి చాకిరిని చేయించుతాడు! ”
గుత్తకు రోడ్లను తానే పడతాడు ”
కూలి ఆరు కానులనే యిస్తాడు ”
పోలీసులతో నిర్బంధిస్తాడు ”
పుటుకు పుటుకునా దెబ్బలు కొడతాడు ”

ఈ విధంగా బాప్టియన్ కోయగూడెం అంతా పోలీసుల సహాయంతో ఏలుతూ వుంటాడురా తమ్ముడు!

అట్టి సమయంలో చింతపల్లి ఘాట్ రోడ్డు ... చేయించమని తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు ప్రేకను ... సంతానం పిళ్ళె అనే ఓవర్సీరును బాప్టియను దగ్గఱకు పంపుతాడు.

చింతపల్లి ఘాట్ రోడ్డు పని అనగా నర్సీపట్నం నుండి చింతపల్లి వరకు ముప్పయి మైళ్ళు ఈ రోడ్డు వేయవలసి వుంది. కొండల్లో అడుగడుగునా రాళ్ళను తొలిచి ఈ రోడ్డును నిర్మించవలసి వుంటుంది. ఈ రోడ్డును వేసినట్లయితే మన్యం సహజ సంపదలను దోచుకొనుట సులభము. ఇక్కడినుండే శ్రీఅల్లూరి విప్లవాత్మక మైనతిరుగుబాటు ప్రారంభమవుతుంది.

బాష్టియను నిబంధనలకు వ్యతిరేకమయినా రోడ్డుపనిని తానే గుత్తకు తీసుకున్నాడు. సంతానం పిళ్ళై, అజీజుల్లా ఖాన్‌ల (పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్) సహాయంతో రోడ్డుపని చేయడం మొదలుపెట్టాడు.

కోయల వీపులు బద్దలవుతున్నాయి. కొందరికి రక్తాలు కారుతున్నాయి. కొందరికి దెబ్బలతో స్పృహ తప్పుతున్నది. అప్పుడు ఆకోయలు బాధతో యే విధంగా రోడ్డు పని చేస్తున్నారో వినరా తమ్ముడూ!

వంత : వినిపించు అన్నయ్యా!

కథకుడు : ఐలేసా! ఓ ఐలేసా! ఐలేసా ఓ ఐలేసా!
భద్రాది రాముడా! బాధ లింకెన్నాళ్ళు?
కరుణ జూపించి మము గావ రావయ్యా!
ఐలేసా! ఓ ఐలేసా! ఐలేసా! ఓ ఐలేసా!

ఆంగ్లేయులొచ్చారు అన్ని యూన్చుకుపోయె!
భూమిపుట్రా ముఠాదార్ల కిచ్చారూ!
కూలీల మయ్యాము కూడు గుడ్డా లేని!
గోచి పాతల బతుకు ఎన్నాళ్ళు స్వామీ!
ఐలేసా! ఓ ఏలేసా! ఐలేసా! ఓ ఐలేసా!

త్రాగుడును నేర్పారు తైతక్కలాడమని
తగవులను మా బ్రతుకు తలక్రిందు జేశారు!
వెట్టిచాకిరులతో తట్టకూలీ బ్రతుకు
ఇట్టె పోగొట్టి—మా కష్టాలు నీ దీర్చు!
ఐలేసా—ఓ ఐలేసా! ఐలేసా—ఓ ఐలేసా!
చెట్టుపుట్టా ముట్టుకుంటె తప్పంటా!
కట్టె-కంపెరుకేను కఠిన శిక్షంటా
కాయ కసరుల నేరి కందగడ్డలు త్రవ్వి
కడుపునింపుట తప్పా! కథ మాది! కరుణించు!
ఐలేసా—ఓ ఐలేసా! ఐలేసా! ఓ ఐలేసా!
రామ రామా! నీవు రాకున్న మా బ్రతుకు
రాళ్ళపాలగునో! ఏ ముళ్ళపాలగునో!
రామరాజని పిలిచి రక్షింపుమంటిమి!
రవ్వ చేయక మమ్ము రక్షింప రావయ్యా!
ఐలేసా! ఓ ఐలేసా! ఐలేసా! ఓ ఐలేసా!

బాస్టియను, అతని పోలీసుల కిరాతకాలకు కోయలు ఎదురు తిరిగారు. కోయలు పనిచేయము పొమ్మన్నారు. పనిముట్లు క్రింద పెట్టారు. పలుగులు. పారలు, తట్టలు క్రింద పడవేశారు.

బాస్టియను పోలీసులను కోయలపై దౌర్జన్యానికి పురికొల్పాడు. హింసాకాండ చెలరేగింది.

కోయలు కూడా ఎదురు తిరిగారు. కోయగూడెమంతా కత్తులు, బల్లెలు, రోకళ్ళు, విల్లమ్ములు ధరించారు. ఆబాలగోపాలం ఎదురునిలిచారు.

వంత: అప్పుడు బ్రాప్టీయును అతని సహచరులు ఏం చేశారు అన్నయ్యా?

కథకుడు: ఇంకేం చేస్తారు? నిప్పులు త్రొక్కిన కోతుల్లా చిందులు వేశారు. పలాయన మంత్రం పఠించారు.

వంత: తరువాత ఏం జరిగింది అన్నయ్యా?

కథకుడు: వీరయ్య పడాలు కోయగూడానికి పెద్ద. అతని నాయకత్వం క్రింద కోయలంతా శ్రీ సీతారామరాజు దగ్గరకు వచ్చి తమ కష్టాలను విన్నవించుకుంటారు. తమను దారి జూపింపమని వేడుకుంటారు.

అంతేగాకుండా అచ్చటికి సమీపమున గట్టుపాణకల గ్రామం వుంది. ఆ గ్రామానికి మునసబు గాము గంటం దొర, అతని తమ్ముడు మల్లుదొర. వారు కూడా ఆంగ్లేయుల యొక్కయు, వారి తాబేదారుల యొక్కయు దురాగతాల భరింపలేక శ్రీ సీతారామరాజును ఆశ్రయించారు.

అంతేగాక శ్రీ రామరాజుకు గోవిందు, రత్తి దంపతుల పరిచయం కలుగుతుంది.

ఎర్రేశుడు, మోదిగాడు, మూగడు మున్నగువారి పరిచయం శ్రీ రాజుకు గలుగుతుంది. వీరి సహాయంతో బ్రిటిషు సామ్రాజ్యవాద శక్తులను, వారి తాబేదారులను ఎదుర్కొనుటకు శ్రీ రామరాజు నిశ్చయించుకున్నాడు.

శ్రీ రామరాజు ఆంగ్లేయ దుష్టశక్తులను ఎదుర్కొనుటకు ముందు కోయ చెంచులలోనున్న హెచ్చు తగ్గు భేదములను నిర్మూలించుటకు, వారిలో ఐకమత్యమును గలిగించుట కృషి చేశాడు.

మనమంతా అన్నదమ్ములం! మనది ఒకటే కులం! కష్టజీవులం! కర్మజీవులం! శ్రమజీవులం! అని ప్రబోధించాడు.

ముఠాదార్ల వలలో పడకుండా పంచాయితీలను ఏర్పాటు చేసుకోమన్నాడు. తమ తగవులను, సమస్యలను తామే పరిష్కరించుకొనవలసినదని వివరించాడు.

అంతేగాదు—వారిని త్రాగుడు మానండని ప్రబోధించాడు. త్రాగుడు మానవులను రాక్షసులను చేస్తుందనీ విశదపరిచాడు. మల్లుదొరవంటి త్రాగుబోతులు గూడ శ్రీ రాజు ప్రబోధం వలన త్రాగుడు మానివేశారు.

శ్రీ రాజు కోయప్రజలను కూడగట్టి బ్రిటిషు సామ్రాజ్యవాదులను ఎదుర్కొనుటకు పూనుకున్నాడు. మట్టినుండి మహావీరులను సృష్టించాడు. ఇత్తడిని పుత్తడిగా మార్చివేశాడు. అజ్ఞానులయిన మన్యం కొండజాతివారిని చైతన్యవంతులుగా తీర్చిదిద్దాడు!

1921 వ సంవత్సరములో ఈ మన్యం తిరుగుబాటు శ్రీ సీతారామరాజు సాగించాడు. ఆ సమయంలో శ్రీ రాజు వయస్సు 24 సంవత్సరాలు. తన విప్లవానికి ప్రాణం "సాయుధ పోరాటం", ఊపిరి "స్వాతంత్ర్య సాధన"గా నిర్ణయించుకున్నాడు.

శ్రీ రాజు మన్యం కోయలను ఈ విధంగా ప్రబోధింపసాగాడురా తమ్ముడూ!

వంత: ఏమనిరా అన్నయ్యా!

కథకుడు:

కొండన్నా! ఓ కోయన్నా! కొండన్నా! ఓ కోయన్నా!
స్వాతంత్ర్యమే మాకు జన్మహక్కని చాటి
జాతి పౌరుషమును నిలుపరా లేచి,
కొండన్నా! ఓ కోయన్నా! కొండన్నా! ఓ కోయన్నా!
నీ గడ్డపై జేరి నిన్ను పీడించేటి
నిలిచినా శత్రువుల నిలిచి యెదిరింపూ!
దోపిడీ దౌర్జన్య దుష్టశక్తుల నిదే
దూరముగ తరిమి నీ శక్తి జూపింపూ!
కొండన్నా! ఓ కోయన్నా! కొండన్నా! ఓ కోయన్నా!
హీనసత్వముకంటె నీచమైనా బ్రతుకు
బ్రతుకింక లేదురా! ప్రగతి కనుగొనరా!
సాయుధులై రండి! సాహసము జూపింప
సర్వ మర్పింపగను రక్త మొలుకగనూ!
కొండన్నా! ఓ కోయన్నా! కొండన్నా! ఓ కోయన్నా!
ఆంగ్లేయ దాసులగు అర్థ హీనసలను
అంటకుడు! ముట్టకుడు! అటులె నిలువఁడీ!
నీ మాతృదాస్యమును నిర్మూలనము సేయ
నీ బలము జూపింపు నిర్జరులు పొగడంగ!
కొండన్నా! ఓ కోయన్నా! కొండన్నా! ఓ కోయన్నా!
పోలీసు స్టేషనులు చుట్టుముట్టండీ!
పోలీసు బలగాన్ని నిలిపి పోరండీ!
తిండిలేకుండ మన మెండి చచ్చే బదులు
పోరాడి చద్దాము పుణ్య పురుషులమల్లె!
కొండన్నా! ఓ కోయన్నా! కొండన్నా! ఓ కోయన్నా!

ఈ విధంగా విప్లవ వీరుడు శ్రీ సీతారామరాజు ప్రబోధానికి కోయజాతి అంతా కదిలింది. కోయజాతి శ్రీ రాజును తమ నాయకునిగా యెన్నుకున్నారు. కోయజాతంతా ఆంగ్లేయులకు వారి తాబేదారులకు వ్యతిరేకంగా పోరాడ సాగారు

శ్రీ రాజు మన్యంలో గాముకొండ ధారకొండ అను రెండు కొండల నడుమ పోరాట శిక్షణ శిబిరం నడిపాడు. అనేక మంది విప్లవ పోరాట యోధులను తయారుచేశాడు. గెరిల్లా పోరాట పద్ధతులనుగూడ శ్రీ రాజు వారికి నేర్పాడు.

వంత: గెరిల్లా పోరాట పద్ధతులంటే ఏమిటిరా అన్నయ్యా? శ్రీ రాజు వారి నే విధంగా ప్రబోధించేవాడు?

కథకుడు : శ్రీ రాజు గెరిల్లా పద్ధతులను గురించి ఈ విధంగా ప్రబోధించేవాడు !

గెరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి!
శత్రువులదె! అదిగదిగో! చండాడండీ! పై పై బడి!
ప్రక్క పోటు పొడవండీ!
పక్షివోలె యెగరండీ!
చుక్కలు తెగి పడినట్టులు గా
సూటిగ శత్రువుపై బడండీ!
గెరిల్లా యోధుల్లారా ! కిమ్మనక మెల్లనరండి !
శత్రువులదె అదిగదిగో! చండాడండీ! పై పై బడి !
మన దేశము నాక్రమించినా
మన సంపద లపహరించినా !
వచ్చిన ఈ పరదేశీయుల
దెచ్చెఅ పరుగిడ జేద్దాము!

గెరిల్లా యోధుల్లారా ! కిమ్మనక మెల్లన రండి !
శత్రువులవె ! అది గదిగో ! చండాడండీ ! పైపై బడి !
మన శత్రువు బలవంతుడురా !
మారణాయుధాల్ గలవాడోయ్
ఎదుట, వెనుక, ప్రక్కల నుండీ
చెదరజేసి యోడిద్దాము

గెరిల్లా యోధుల్లారా ! కిమ్మనక మెల్లనరండి !
శత్రువులవె అదిగదిగో ! చండాడండీ ! పై పై బడి !
వెనుక నుండి పై బడదాము !
వేగమె కనుమఱుగవుదాము !
ప్రక్కనుండి పోటులు పొడిచి
పరుగున వే దాగుందాము !

గెరిల్లా యోధుల్లారా ! కిమ్మనక మెల్లనరండి !
శత్రువులవె ! అదిగదిగో ! చండాడండీ ! పై పై బడి !
కడలివోలె లో గొందాము !
సుడులు చుట్టి ముడియిద్దాము !
పెనుగాలుల వలె పడదాము !
పెడబొబ్బలు పుట్టిద్దాము !

గెరిల్లా యోధుల్లారా ! కిమ్మనక మెల్లనరండి !
శత్రువులవె ! అదిగదిగో ! చండాడండి ! పై పై బడి !
అదురు పుట్టి బెదరగవలెరా !
కదిలి దేశమును విడవలెరా !
భారతీయ వీరులు అనగా
భయముతోడ పరుగిడవలెరా !

గరిల్లా యోధుల్లారా! కిమ్మనక మెల్లన రండి!
శత్రువులదె! అదిగదిగో! చండాడుండి! పై పై బడి!

ఈ విధంగా శ్రీ రాజు కోయజాతిని అన్ని విధాలుగా తీర్చిదిద్దుతాడు. కోయజాతి అంతా శ్రీ రాజును కంటి పాపగా జూచుకునే వారు. శ్రీ రాజు ఆజ్ఞలను ఉత్సాహంగా నెఱవేర్చేవారు.

సహ : అన్నయ్యా తుపాకులు, ఫిరంగులు మొదలైన మారణాయుధాలు గలిగిన ఆంగ్లేయులతో శ్రీ సీతారామరాజు ఏ విధంగా పోట్లాడేవాడు అన్నయ్యా?

కథకుడు : తమ్ముడూ! చెపుతాను విను!

తంధానా! తంధానా భాయి దేవతందనానా!
ఎచ్చట హింసా ప్రజ్వరిల్లినా     తంధానా తందాన తందనా
ఎచట దౌర్జన్యం పాటమరించినా     ,,
అచ్చట రాజు ప్రత్యక్షమగును     ,,
అచ్చట రాజు చొచ్చుకు పోవును     ,,
విల్లమ్ములతో వచ్చి చేరుకొను వేయికనులతోడా     ,,
తంధానా! తందానా భాయి దేవనందనానా!

దుష్టులనందఱ తుడిచివేయును     ,,
పగతుర బట్టి- బంధించి వేయును     ,,
పీడిత ప్రజలకు-ప్రియతమ నేతగ     ,,
మార్గదర్శియై-మార్గము జూపును     ,,
అరివీరులు తా మదురు కొనిరి మఱి బెదుర సాగినారు
తంధానా తందానా భాయి దేవనందనానా!

అమ్ముకు కట్టి మిరపకాయలను ,,
అంపును శేఖల శత్రు శిబిరముల ,,
ఇన్ని దినములకు—ఇన్ని గంటలకు ,,
ఇదిగో! వచ్చెద కాచుకొమ్మనుచు ,,
ధైర్యముంటె నా దాడినెదర్కొనుమనుచు శేఖలంపు
తంధానా! తంధానాభాయి దేవనందనానా!

కబురంపిన యా సమయమునందే ,,
కలచివైచు తన శత్రుమూకలను ,,
చుట్టుముట్టు పోలీసు స్టేషనులు ,,
మట్టుపెట్టు తాలూకా కచేరీల్ ,,
దాడిచేయు సైనిక శిబిరాలను ,,
తత్తరపాటును జేయు సైనికుల ,,
ఆకస్మికముగ దాడులు సలుపును నశలగ శత్రువులు
తంధానా! తంధానాభాయి దేవనందనానా!

ఈ విధంగా విప్లవవీరుడు శ్రీ సీతారామరాజు ఆంగ్ల ప్రభుత్వాన్ని ముప్పతిప్పలు పెట్టి మూడు చెఱువులు నీళ్ళు త్రాగిస్తున్నాడు తమ్ముడూ.

వంత : అన్నయ్యా! మిరపకాయ టపా అంటే ఏమిటిరా?

కథకుడు ; మిరపకాయటపాను శ్రీ సీతారామరాజు, అతని సహచరులు ప్రయోగించేవారు. ఒక అమ్ముకు చీటీని గ్రుచ్చి దానితో పాటు ఒక మిరపకాయను గూడ అమ్ముకు గ్రుచ్చేవారు. అమ్మును తాము దాడిచేయబోయే ప్రదేశము దాపున ఒక చెట్టుకో తలుపుకో ప్రయోగించేవారు. అమ్ము

కున్న చీటీని చదివి ఆంగ్లేయులు వారి తాబేదారులు హడలి పోయేవారు. అంటే శ్రీ రాజు పట్ట పగలు, ముందుగా చెప్పి దాడిచేయడానికి వచ్చే వాడన్న మాట !

వంత : ఆహా! ఏమి వింత! ఎంత చిత్రం! సరే శ్రీరాజు ఏవ స్టేషన్లపై దాడి చేశాడో వివరంగా వినాలని నాకెంతో కుతూహలంగా వుందిరా అన్నయ్యా!

కథకుడు : వినరా! తమ్ముడూ! మొట్టమొదటి సారిగా చింతపల్లి పోలీస్ స్టేషన్‌పై ఏ విధంగా శ్రీరాజు దాడి చేశాడో చెబుతాను విను!

వినరా భారత వీరకుమారా! విజయము మనదేరా!
పందొమ్మిదొందల ఇరువది రెండు పొందుగ అగష్టు!
ఇరువది రెండవ తేదీనాడు జరిగె పట్టపగలు!
చింతపల్లి పోలీసు స్టేషనుపై వింత మెఱుపు దాడి!
ముందుగ బంపెను 'మిరప టపాను' పొందుగ వైరులకు!
ఆంగిలేయుల దాసులు చూచీ హడలిపోయి రవుడు!
రాజు బంపినా జాబును చదివి రాళ్ళుగ మారారు!
రానే వచ్చెను రామరాజు అదె రాజఠీవి తోడ!
రాజు నెదుర్కొను శక్తిలేక యా రాక్షస బలగంబు!
తుపాకులన్నీ రాజు ముందటికి తోడి తెచ్చినారు!
మందుగుండు సామాను నంతటిని ముందు బెట్టినారు!
ఇతరాయుధముల నన్నిటి దెచ్చి యిచ్చిరి రాజునకు!
ప్రాణములను రక్షింప మనుచును పన్నుగ మ్రొక్కిరిగ!

అంతట రాజు వారిచ్చిన ఆయుధములను స్వీకరించి, అధికారులచేత పోలీసులకు మాట రాకుండునట్లు తాను వశ

పట్టుకొన్న ఆయుధములను రికార్డు పుస్తకములో వ్రాసే వాడట!

వంత : ఆహా! ఏమి సీతారామరాజు ధైర్యము?

కథకుడు : స్టేషనులో వున్న రికార్డును ధ్వంసం చేసి యెవరికిని అపకారం చేయకుండ వెళ్ళిపోయేవాడట! అయితే పోలీసులు యెదురు తిరిగితే తన తడాఖా చూపించేవాడు!

అదే విధంగా 1922 ఆగస్టు 23 వ తేదీని కృష్ణదేవు పేట పోలీసు స్టేషను మీద దాడి చేశాడు! తుపాకులు, మందుగుండును వశ పట్టుకొని రికార్డులు ధ్వంసం చేసి వెళ్ళిపోయాడు.

ఆ మరుసటి దినమున అంటే ఆగస్టు 24 వ తేదీన రాజవొమ్మంగి పోలీసు స్టేషను మీద దాడిచేసి, తుపాకులను మందుగుండును వశపట్టుకున్నాడు.

అచ్చటే బంధింప బడియున్న లాగరాయి పితూరి యోధుడు వీరయ్యను విముక్తి చేశాడు. వీరయ్య తరువాత శ్రీ సీతారామరాజు జట్టుతో చేరిపోయాడు.

వంత : అన్నయ్యా! లాగరాయి పితూరి అంటే ఏమిట్రా?

కథకుడు : అరే! తమ్ముడూ! ఈ మన్యం భూమిలో శ్రీ సీతారామరాజుకు ముందు మూడు పితూరీలు జరిగినవి. పితూరీ అంటే తిరుగుబాటు. అంటే విప్లవం! సత్యాన్ని స్థాపించడానికి అన్యాయం, అసత్యాలతో జరిగే పోరాటం!

వంత : అవేమిటో కొద్దిలో చెప్పరా అన్నయ్యా!

కథకుడు : ఇంతకుముందు అంటే సీతారామరాజు జరిపిన పోరాటానికి ముందు నలుబది సంవత్సరాల క్రిందట ద్వారబంధాల చంద్రయ్య నాయకత్వం క్రింద ఒక పితూరి జరిగింది. ఆంగ్లేయులు వారి తాబేదారులతో మూడు రాత్రిళ్ళు, మూడు పగళ్ళు పోరాడి ద్వారబంధాల చంద్రయ్య అసువు లర్పించాడు!

తరువాత కొంత కాలానికి కోయరాముని నాయకత్వం క్రింద మరొక పితూరి జరిగింది. దానిని కూడ సామ్రాజ్య వాదులు అణచివేశారు.

శ్రీ రామరాజు పోరాటానికి ఆరేండ్ల క్రిందట లాగరాయి పితూరి జరిగింది. శ్రీ గరగండ మంగరాజు దానికి నాయకత్వం వహించాడు. అతడు చూపుకు పులి, వేటుకు ఫిరంగి. భూమి పుట్టా మనదేనని ఉద్యమం ప్రారంభించాడు. ఆ వుద్యమాన్ని కూడ సామ్రాజ్య వాదులు అణచివేశారు.

ఈ విధంగా శ్రీ సీతారామరాజు విప్లవ సైన్యం జైత్రయాత్ర సాగిస్తూ, పోలీసు స్టేషను తరువాత పోలీసు స్టేషను, తాలూకా కచేరి తరువాత తాలూకా కచేరి మీాద దాడులు చేస్తూ ముందుకు సాగిపోతు వున్నదిరా తమ్ముడూ!

వంత : తరువాత యేం జరిగింది అన్నయ్యా?

కథకుడు : వినరా తమ్ముడూ!

తంధానా—తంధానా! భాయి దేవనందనానా!
విప్లవ సైన్యం విజయయాత్రలను తంధానా తంధాన తందనా
విప్లవ వీరుల తిరుగుబాటులను ,,

వెల్లువ నాపగ శక్తి లేదనుచు ,,
జల్లుల నాపగ చాల జాలనని ,,
రామరాజు మన పాలిట పిడుగని ,,
రామరాజు మన పాలి మృత్యువని ,,
బాష్టియనప్పుడు బ్రేకను దొరకు పంపినాడు వినతీ
తంధానా-తంధానా! భాయి దేవనందనానా!

జిల్లా కలెక్టరు బ్రేకనప్పుడు ,,
హాల్లో హాల్లోయను ఆర్తనాదమున ,,
మన్యం విప్లవ విజయ యాత్రలను ,,
మన్యం వీరుని చిత్రగాధలను ,,
పూస గ్రుచ్చినటు వివరించెను తా ,,
పూర్తి వివరముల విశదముగా తా ,,
మద్రాసు గవర్నరు వెల్లింగ్టనుకూ మనవి చేసికొనెనూ

మన్యం వీరుల నణచి వేయుటకు ,,
మన్యం విప్లవ మణగ ద్రొక్కుటకు ,,
జయపురి నుండి యేనుగు లొచ్చెను ,,
జర్ జర్ మనుచును లారీల నిండ ,,
కాకినాడ రిజర్వు దళములు కదిలివచ్చినాయి
తంధానా - తంధానా భాయి దేవనందనానా!

ఈ విధంగా బాష్టియన్ జిల్లా కలెక్టరు బ్రేకనుల మొత్తుకోలుకు ఆనాటి మదరాసు గవర్నరు లార్డు వెల్లింగ్టను కలవర పడతారు. ఆంగ్ల పీఠాధి పతులకు ఆతురత కలుగుతుంది. వెంటనే జయపురం నుండి ఏనుగులు, కాకినాడ నుండి రిజ్వరు పోలీసు దళము వచ్చింది.

ఏ విధంగానైనా మన్యం తిరుగుబాటును అణచివేయ వలసిందని ప్రపంచ యుద్ధంలో పేరుగాంచిన మేజర్ జనరల్ గుడాల్‌ను మదరాసు గవర్నరు పంపిస్తాడు.

మేజర్ జనరల్ గుడాల్ అతి క్రూరుడు. అతడు మన్యానికి వచ్చిన వెంటనే సైనిక శాసనాన్ని ప్రకటిస్తాడు.

విప్లవవీరుడు శ్రీ సీతారామరాజు జైత్రయాత్ర సాగిపోతూనే వుంది. చీఫ్ కమాండర్ గుడాల్ కూడ ఆ మన్యం విప్లవ రథ చక్రాలను ఆపలేకపోయాడు. ఆపలేక పోవడమే కాదు! వెనుకంజ వేయవలసి వచ్చింది.

శ్రీ సీతారామరాజు సాగించిన ఉద్యమము మన్యంలో ఆంగ్ల ప్రభుత్వం శిథిలమయ్యే స్థితికి వచ్చింది. అట్టి పరిస్థితిలో మేజర్ జనరల్ గుడాల్ ఏమి చేశాడంటే—

వంత : ఏమి చేశాడు అన్నయ్యా?

కథకుడు :—

తంధానా—తంధానా భాయి దేవనందనానా
పై అధికార్లకు మొఱలు పెట్టెను తంధానాతందానతందనా
పైపై మాటలు కావని చెప్పెను ,,
కుత్తుకపోయే సమయమొచ్చెనని ,,
కుయ్యో మొఱ్ఱో యని కూతపెట్టెను ,,
విప్లవ వార్తలు విశదపఱచెనూ వివరముగా నపుడు
తంధానా-తంధానా భాయి దేవనందనానా!

రక్షించండని మొఱలు పెట్టెను ,,
భక్షింపకముందే కాపాడగ! ,,

రామరాజుతో చాలలేమనుచు ,,
రామరాజుతో పోరలేమనుచు ,,
ఆంగ్ల రాజ్య పరాజయమ్మనుచు ,,
ఆంగిలేయులకు పరాభవమ్మనుచు ,,
ఖచ్చితముగ మన అపజయ మిదియని కబురు చేసినాడూ!
తంధానా-తంధానా భాయి దేవనందనానా!

గుడాలు విజటికి పై అధికారులు ,,
పంపిరి వేలాది సైనిక భటులను ,,
అస్సాంనుండీ రైఫిలు దళమును ,,
అంపినారు ఆ మన్య భూములకు ,,
గూర్ఖా దళమును గూర్చి పంపిరీ ,,
మలబార్ పోలీసు మందిని దెచ్చిరి మన్యం భూములకూ
తంధానా—తంధానా భాయి దేవ నందనానా!

మేజర్ జనరల్ గుడాలు, తూర్పు గోదావరి జిల్లా కలెక్టరు బ్రేకను దొర మొత్తుకోళ్ళకు వెంటనే వేలాది సైనికులతో గూడిన స్పెషల్ ట్రెయిను మదరాసునుండి బయలు దేరింది. అస్సాం, మలబార్ గూర్ఖా దళాలతో మన్యం అంతా నిండిపోయింది.

తూర్పు గోదావరి జిల్లా కలెక్టరుగా బ్రేకను దొర పోయి రూథరుఫర్డు వచ్చాడు. ఇతడు అదివరకు గుంటూరు జిల్లా కలెక్టరుగా నుండి పన్నుల నిరాకరణోద్యమం సాగించిన పల్నాటి వీర హనుమంతును రాజీకని పిలిపించి వధించి నది యీ రూథర్ ఫర్డే!

ప్రపంచయుద్ధంలో యెడారి యుద్ధ యోధులుగా ప్రఖ్యాతిగాంచిన కవర్టు, హైటరు అనువారలను గుడాలుకు సహాయకులుగా గవర్నరు పంపించాడు.

మేజర్ జనరల్ గుడాలు మన్యాన్నంతా అగ్ని గుండంగా మార్చివేశాడు. శ్రీ సీతారామరాజు వెలిగించిన విప్లవజ్యోతిని ఆర్పివేయుటకు యత్నించారు. కాని శ్రీ రాజును మాత్రం గుడాలు పట్టుకోలేకపోయాడు.

వేలాది సైనిక బలమున్నా, కొండంత ఆయుధ బలమున్నా రామరాజంటే హడలు గుడాలుకు!

శ్రీ రామరాజును శౌర్యంతో గానీ, యుద్ధంలో గానీ పట్టుకొనుట సాధ్యంకాదనీ, మోసంతో శ్రీ రాజును పట్టుకోవాలని గుడాలు ఎత్తువేస్తాడు. శ్రీ రామరాజుకు ఆనాడు ఆశ్రయమిచ్చిన భాస్కరరావుగారి ద్వార బంధించాలని ఎత్తువేస్తాడు.

గుడాలు తాము ఓడిపోయామని, శ్రీ రామరాజును క్షమాభిక్ష వేడుకుంటామని శ్రీభాస్కరరావుకుకబురుచేశాడు.

ఆ విషయం శ్రీ భాస్కరరావు శ్రీ రాజుతో చెప్పి, మన్యంలో శాంతి స్థాపింపవలసిందనీ, గుడాలుతో సంధి జేసికొనుటకు వెళ్ళవలసిందని సలహా ఇస్తారు. పాపం! ఆంగ్లేయుల కుటిల క్రూరనీతి భాస్కరరావుగారి కేమి తెలుసు?

వంత : తరువాత ఏం జరిగింది అన్నయ్యా?

కథకుడు : రాజు కూడ ఆలోచించాడు. కొండంత పశుబలంతో వున్న ఆంగ్ల ప్రభుత్వాన్ని ఒంటరిగా యెదుర్కొనుట నష్టదాయకమని తెలుసుకున్నాడు. మెరికల్లాంటి,

రత్నాలవంటి యెంతోమంది సహచరులు ఈ విప్లవోద్యమంలో మరణించడం రాజుకు కష్టమనిపించింది.

అయినప్పటికి రాజు ఒక క్షణం చలించాడు. తక్షణం తండ్రిమాట జ్ఞాపకానికొచ్చింది "పరదేశీయుల ముందు తల వంచ వద్దు" అని చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. "వీరుల రక్తం వర్ష ధారల వలె విరజిమ్మ బడినప్పుడే సత్యం ఉద్భవిస్తుంద"ని భావించి స్థిరనిశ్చయాని కొస్తాడు. తన దృఢ సంకల్పాన్ని భాస్కరరావుగారితో చెప్పి తన కార్యక్రమంలో నిమగ్నుడవుతాడు.

ఆంగ్ల సేనాని గుడాలు మన్యాన్నంతా అగ్నిగుండంగా చేసినప్పటికీ శ్రీ రాజు విప్లవ విజయయాత్ర సాగిపోతూనే వుంది.

ఒకనాడు విప్లవ సైన్యం ఏడొంపుల ఘాటునెక్కారు. అ కొండల మధ్య విప్లవాన్ని అణచడానికి ఆంగ్లేయులు నిర్మించుకున్న యెత్తు అయిన కట్టడాలపై దాడిచేశారు. ఏడు సార్లు దాడిచేసి అచ్చటి ఆహార పదార్థాలను కోయలకు పంచిపెట్టారు.

1922 సెప్టెంబరు నాల్గవ తేదీన ఒంజేరి గ్రామంలో శ్రీ సీతారామరాజు అతని సహచరులు ఉద్యమాన్ని సింహావలోకనం చేసుకుంటున్న తరుణంలో ఆంగ్ల సేనాని స్కైమస్ హేర్ జయపురం ఏనుగులతో దాడిచేస్తాడు. మన్యం వీరుల వీరోచిత శౌర్య పరాక్రమాలముందు ఆగ్లసైన్యం పరాజితమై పారిపోయింది.

అదే నెలలో సెప్టెంబరు 17వ తేదీని చరిత్ర ప్రసిద్ధి పొందిన మహోక యుద్ధం జరిగింది తమ్ముళ్లూ!

వంత : అదే యుద్ధం అన్నయ్యా?

కథకుడు : మొక్కజొన్న చేల యుద్ధంరా తమ్ముడూ!

వంత : మొక్కజొన్న చేల యుద్ధం అంటే యేమిటో చెప్పరా అన్నయ్యా!

కథకుడు : ఆ యుద్ధం మొక్కజొన్న చేలలో మన్యం వీరులకు ఆంగ్ల సైనికులకు జరిగింది. శ్రీ రామరాజు విశాఖ జిల్లా పెదవలసలో వున్న సమయంలో 200 మంది సైనికులతో, మారణాయుధాలతో టాల్బర్టు అనే ఆంగ్ల సేనాని దొంగ చాటుగ, మొక్కజొన్న చేలలో దాగి, దాడి చేశాడు.

శ్రీ రామరాజు, అతని సహచరులు మొక్కజొన్న చేలలో నుండే యెదురు దాడిచేసి, టాల్బర్టు సేనాని పారిపోయేటట్లు పరాభవించారు.

అదే నెల 19 తేదీనాడు చోడవరం తాలూకా కచేరి ఆఫీసు మీద విప్లవ సైన్యం దాడి చేసింది. ఆ ఆఫీసు పరిరక్షకుడు బ్రిటిషు సేనాని జాన్ పలాయన మంత్రం పఠించాడు.

ఈ విధంగా శ్రీ సీతారామరాజును, మన్యం విప్లవాన్ని అణచడం సాధ్యం కాదని తెల్లదొరలకు తెలిసిపోయింది. సైనిక శాసనాన్ని తీవ్రంగా అమలు పరచి గ్రామ గ్రామాలు కాల్చి వేయడం ప్రారంభించారు. అస్సాం, మలబార్, గూర్ఖా దళాలను రంగంలోకి దించారు. కవర్టు, హైటరులు గజదళానికి నాయకత్వం వహించి బరిమీదికి వచ్చారు.

ఆ యెడారి యోధులు మన విప్లవ యోధుల దాటికి తట్టుకోలేక పోయారు. పడాలు, గంటం దొరల అమ్ముల ఘాటికి కవర్టు, హైటరులు యమ సదనానికి అతిథులవుతారు.

చనిపోయిన ఆ ఎడారి యోధుల శవాలను స్టీవర్టు అను ఆంగ్ల సేనాని తెల్లజెండాలతో వచ్చి శ్రీరాజు అను మతితో తీసికొని పోవలసిన గతి పట్టింది.

ఈ సంఘటనతో గుడాలు, మతింత రెచ్చిపోయాడు. తెల్లదొరలకు పిచ్చి యెత్తినంత పని జరిగింది. మన్యా న్నంతా కాల్చి శ్మశానంగా మార్చి వేస్తున్నారు. కోయ ప్రజానీకాన్ని కాకులవలె కాల్చి చంపుతున్నారు. బయటి నుండి ఆహార పదార్థాలు రాకుండ దిగ్బంధం చేశారు.

విప్లవకారులను పట్టుకున్న వారికి వేలాది రూపాయలు బహుమతిగా ఇస్తామని ప్రకటించారు. విప్లవకారుల పేర్లను ప్రకటించారు.

1922 అక్టోబరు 15 వ తేదీని తెల్లదొరలకు గుణపాఠం చెప్పాలని మన్యం వీరులు నిశ్చయించారు. అడ్డతీగెల పోలీసు స్టేషనుపై దాడి చేశారు. 40 సంవత్సరాల క్రిందట జరిగిన తిరుగుబాటులో ద్వారబంధాల చంద్రయ్య మూడు రాత్రిళ్ళు, మూడు పగళ్ళు ఆంగ్లేయులతో హోరా హోరీగా పోరాడింది యిచ్చటనే!

1923 ఏప్రిల్ 17 వ తేదీని విప్లవ వీరులు అన్నవరం పోలీసు స్టేషనుపై దాడి చేశారు. ఆరోజు వేలాది ప్రజలు రామరాజును దర్శించి ఆనందించారు.

జిల్లాకలెక్టరు రూథరుఫర్డు 500 మంది సైనికులతో రాజును బంధిద్దామని వచ్చాడు. కాని ప్రజావాహిని ముందు అతని పప్పులేవీరా ఉడకలేదు.

కాని క్రూరకర్కశ రాబందులైన ఆంగ్లేయుల ముందు అసంఖ్యాకమైన సైనికులు, మరణాయుధాల ముందు మన మన్యం వీరులు ఎంతో కాలం నిలువలేక పోయారురా తమ్ముడూ!

మన్యం అంతా సైనిక శాసనంలో వుంది. గ్రామం తరువాత గ్రామం తగులబెట్టి భీభత్సం చేస్తున్నారు ఎక్కడ జూచినా పోలీసులే! ఎక్కడ జూచినా సైనికులే! గూఢ చారులే! ఈ విధమైన పశుబలం ముందు మన వీరులు నిలవ లేకపోయారు.

ఒక యింటిలో మల్లుదొర ఉండగా కీరన్స్ అను ఆంగ్ల సేనాని 200 మంది సైనికులతో దాడిచేసి అతనిని వధిస్తాడు.

మన్యానికి ప్రాణం, శ్రీరాజుకు కుడిభుజం అయిన గంటందొర యుద్ధంలో మరణిస్తాడు. ఇతని మరణం మన్యం మాణిక్య హారం తెగిపోయినట్లుగా శ్రీరాజు భావిస్తాడు.

పడాలు, గోవిందు శత్రువులతో చుట్టుముట్టబడి హోరా హోరీగా పోరాడుతారు. చివరకు వారిరువురు వీర స్వర్గాన్నలంకరిస్తారు.

వీరనారి చెంచు యువతి. రత్తి నిండు గర్భిణి శత్రువు-లతో పోరాడుతూ మరణిస్తుంది.

మూగడు, మోదిగాడు ఆంగ్ల కిరాతకులతో పోరాడి అసంఖ్యాకులైన శత్రువులను యమపురికంపి, తాము కూడ నేలకొరుగుతారు.

కొండపల్లి యుద్ధంలో అగ్గిరాజు, ఎర్రేశుడు వీర స్వర్గమలంకరిస్తారు. ఆంగ్లేయులు అగ్గిరాజు అని పేరుపడ్డ శ్రీ నారాయణరాజును వధించి అతని శవాన్ని గుఱ్ఱానికి కట్టి యీడ్చుకుపోతారు. అతని శరీరం ముక్కలు ముక్కలై పుడమినిండ విరజిమ్మబడుతుంది. ఆంగ్లేయ దురహంకారులు ఎంతటి మదోన్మత్తులో దయా విహీనులో ఈ సంఘటన విశదపరుస్తుంది. ఈ సంఘటన మన్యం వీరుల అపజయానికి సంకేతమని చెప్పవచ్చును.

వీరులందరూ ఈ విధంగా వీర స్వర్గమలంకరించుట రాజు వారికి అశ్రుతర్పణ మర్పిస్తాడు. మనసులో వీరవందన మాచరిస్తాడు.

శాళ్ళపాలెంలో మిగిలి వున్న వీరులు సైన్యంతో పోరాడుతున్న సంగతి తెలిసి శ్రీ సీతారామరాజు వీరరౌద్ర మూర్తియై రణరంగంలో దుముకుతాడు.

అసంఖ్యాకమైన అస్సాం సైన్యాన్ని యెదుర్కొంటున్న బొజ్జి పడాలు, బాలయ్య పడాలు, కొత్తన్న పడాలు, శరభన్న పడాలులతో కలిసి శత్రువులతో శ్రీ రాజు పోరాడుతాడు. అరివీర భయంకరుడైన శ్రీ రాజు చేతిలో అసంఖ్యాకమైన శత్రుసేన మరణిస్తుంది.

రాజు శరీరమంతా గాయాలతో నిండిపోతుంది. బొజ్జి, బాలయ్య శతు ఫిరంగి గుండ్లకు ఆహుతైపోతారు.

శ్రీరాజు మిగిలిన తన సహచరులను కొత్తన్న శరభన్నలను శత్రువులతో పోరాడుతున్న విప్లవ సైన్యానికి సహాయంగా ముందుకు వెళ్ళమని చెప్పి, తానుగూడ తన పంచకళ్యాణి గుఱ్ఱముపై బయలుదేరి వెళ్ళిపోతారు.

శ్రీ రాజు పంచకల్యాణి గుఱ్ఱం దారిలో మరణిస్తుంది. దానిపై తనరక్తధారలతో తడిసిన అరుణవస్త్రాన్ని కప్పి వీర వందనం సమర్పిస్తాడు.

తన మిత్రులను ముందుకు వెళ్ళమని చెప్పి, రక్తసిక్తమైన దేహాన్ని ముంప యేటిలో కడిగికొని సంధ్యార్ఘ్యానికి అర్ఘ్య మిస్తూ వుంటాడు.

ఒక గూఢచారి ద్వార రాజు విషయం సమీపంలో వున్న అస్సాం సైన్యానికి తెలుస్తుంది. రివ్వున వచ్చి ఆ వీర సింహాన్ని శ్రీ సీతారామరాజును సైనికులు చుట్టుముడతారు. గాయాలతో కదలలేక యున్న శ్రీ రాజు సైన్యానికి లొంగిపోతాడు. పట్టి బంధించి గుడాలు దగ్గఱకు తీసుకుపోతారు.

శ్రీ రాజును గుడాలును చూడగానే ఏం జరిగిందో వినరా తమ్ముడూ!

వంత : ఏం జరిగింది అన్నయ్యా?

కథకుడు:

తంధానా–తంధానా! భాయి దేవనందనానా!
వచ్చెనదిగో మన మన్యపుసింహం తంధానా తందాన తందనా
వచ్చెనదిగో మన విప్లవజ్యోతి ,,
వచ్చెనదిగో మన విప్లవ వీరుడు ,,
వచ్చెనదిగో మన తెలుగు బెబ్బులి ,,

సింహాగమనమున చిరునగు మోమున ,,
గుడాలు గుండెలు గుటగుట మనెను ,,
చేతిని పిస్టలు—చేజారినదీ ,,
బ్రాష్టియనప్పుడు ప్రక్కకు తొలగెను భయము సండడింపా!
తంధానా - తంధానా భాయి దేవనందనానా!

అట్టి సమయములో శ్రీ రాజును ఇనుప గొలుసులతో బంధించి, ఒక చెట్టుకు కట్టివేయుమని గుడాలు సైనికులను ఆజ్ఞాపించాడు.

సైనికులు గుడాలు ఆజ్ఞ ననుసరించి ఆ వీరసింహాన్ని ఇనుప గొలుసులతో బంధించి ఒక చెట్టుకు కట్టి వేశారు.

బంధితుడైన శ్రీ రామరాజును గుడాలు బందిపోటువని నిందించాడు. అందుకనే యీవిధంగా యినుప గొలుసులతో బంధించానని కిరాతుడైన గుడాలు పలికాడు.

ఆవిధంగా గుడాలు నిందింపగానే శ్రీ రాజు ఉగ్రుడయ్యాడు. కన్నులు చింత నిప్పులుచేసి సింహాగర్జనతో ఈ విధంగా పలికాడురా తమ్ముడూ!

వంత : ఏ విధంగా అన్నయ్యా?

కథకుడు :—

తంధానా—తంధానా భాయి దేవనందనానా
ఏమన్నావుర పాపి గుడాలు! తంధానా తందాన తంధానా
ఏమన్నావుర దేశ దిమ్మరీ! ,,
నిరాయుధుడ నను బంధింపదగునా? ,,
నీచుడవుర! యే నీతి లేదురా! ,,
దేశం కానీ దేశంలో పుట్టీ ,,

దేశం కాని దేశము వచ్చి ”
దేశ దేశాలను దోపిడిచేసే ద్రోహులురా మీరు!
తంధానా-తం-ధానా భాయి దేవనందనానా!
అందిన జుట్టూ పట్టుకొందురూ ”
అందక పోతే కాళ్ళ బేరము ”
ఫలితము తప్పక అనుభవించెదరు ”
పాతకుడువు మీ జాతి నైజమురా ”
తిన్న యింటి వాసములను ఎంచే ”
తిరిపెమెత్తెడి జాతి మీదిరా!
తరలిపొండు మా దేశమునుండి! తరలిపొండి! పొండి!
తంధానా! తందానా భాయి దేవనందనానా!

తెలుగు జాతిరా! తెలుగు బిడ్డనురా! ”
తీయని తెలుగు బాష నాదిరా ”
కొండను సైతము ఢీకొన గలిగిన ”
కోటి యేనుగుల సత్తువ మాదిర! ”
మృగేంద్రంబులా పోరే జాతిర! ”
మెఱుపు తీగెలా మెఱిసే జాతిర! ”
పిఱికి పందవుర! పేదగ నుండక పెద్ద మాటలేలా?
తంధానా—తందానా భాయి దేవనందనానా!

మా పల్నాటి వీరహనుమంతును ”
మాటగ రాజీకని కలిపించి ”
ప్రాణము తీసిన పరమ ద్రోహులు ”
బందిపోటుతన మీది కాదటరా! ”
అడుగడుగనను రక్త మొలికినా ”

అసువులిచ్చినా అమరవీరుడు ”
శతపోరు సాగించి శౌర్యం జూపిన ”
కట్ట బొమ్మనీ క్రాంతి వీరునీ కదనము మఱచారా ?
తంధానా-తందానా భాయి దేవనందనానా !

ముప్పేట దాడుల ముక్కలు చేయుచు ”
మూడు చెఱువుల నీళ్ళు దాపినా ”
ద్వారబంధాల చంద్రయ్యా నవుడే ”
అరమఱచారా భీరువులారా? ”
కంటి కగపడిన తెల్లదొరలను ”
కఱకున నఱికిన శౌర్యప్రతాపుడు ”
కోయ రాముని మరచిపోతిరా? ”
కోయ భీముని మరచిపోతిరా? ”
నిండు పళ్ళెమున వీరా తలలుంచి ”
నిజాము ప్రభునకు కానుక లంపిన ”
వీరయోధుడు-శౌర్యవిక్రముడు ”
విప్లవ జెండా నెగురవేసినా ”
తెలంగాణ వెంకయ్యాను మఱచి తెలివి తప్పినారా?
తంధానా-తందానా భాయి దేవనందనానా !

ఈ విధంగా శ్రీ సీతారామరాజు పలికి కొదమ సింగమువలె కుప్పించడానికి విజృంభించాడు. అప్పుడే సైనికుల బారునుండి యెన్నో తుపాకి గుండ్లు వచ్చి శ్రీ రాజు శరీరంలో దూసుకు పోయాయి. రక్తధార లొలుకుతున్న కడుపును పట్టుకొని తూలుతూ శ్రీ రామరాజు !
వినరా భారత వీరకుమారా ! విజయము మనదేరా !

ఎంతకెంత తెగించినారురా! ఇంత సిగ్గులేకా!
సకల దేశమును కబళించామని గర్వమింక తగదు!
మానవ రూపవు ముష్కరులారా! మాట యొకటి వినరా!
మర తుపాకులను ఫిరంగి గుండ్లను మాట సాగదింకా!
సైనిక పశుబల సామ్రాజ్యములు యిక సాగవింక వినరా!
భారత ప్రజలదె స్వాతంత్ర్యమనే-భవ్య వ్రతము బూని!
నీ రాజ్యమును కూల్చద్రోయగా-నిలిచిపోరగలరు!
**కోటి కోటి సీతారామరాజులు కొల్లగ వస్తారు!**

అని ఈవిధంగా శ్రీ రాజు పలుకుతున్నప్పుడు కఠినకర్కశుడైన గుడాలు ఒక ఫిరంగిని రామరాజుపై గురి పెట్టి కాల్చమని ఆజ్ఞాపిస్తాడు. ఆ ఫిరంగి గుళ్ళచే రాజు "వందే మాతరం" అంటూ నేలకొరుగుతాడు.

శ్రీ రామరాజు పీడ విరగడయి పోయిందని దొరలు సంతోషిస్తారు.

ధరణి కొరిగిన శ్రీ సీతారామరాజు తెల్లదొరలతో ఈ విధంగా పలుకుతాడు తమ్ముడూ!

వంత: ఏమని అన్నయ్యా!

కథకుడు: వినరా భారత వీరకుమారా! విజయము మనదేరా!
వీరుడెప్పుడూ మరణింపడురా! వినరా గజదొంగా!
విప్లవాగ్ని చల్లారదు యెప్పుడు వినరా! నరపశువా!
నే మరణింపను నే మరణింపను నిక్కముగా వినరా!
అంతరాత్మ నా దావరించెను అఖిల భారతమున
నిరాకారమై దేశభక్తులలో నిలిచియుందు నెపుడు
ముక్కోటాంధ్రుల చైతన్యమునై మురియుచుందు నెపుడు

భారతప్రజలు అందఱు కూడి పరవశ్యను ద్రోక్కి
స్వారాజ్యము సంపాదించెదరు సౌఖ్య జగతికొఱకు
చీకటి తెరలు తొలగక తప్పవు చింతలు తొలగంగా!
నవభారతి ముదయింపక తప్పదు నవసంధ్యలు తొలుకా!

అని యీవిధంగా శ్రీ రామరాజు ఆంగ్ల సేనాని గుడాలుతో పలికి, అచట మూగిన కోయప్రజలకు తన అంతిమ సందేశాన్ని ఈ విధంగా యిచ్చాడురా తమ్ముడూ!

వంత: ఏమనిరా అన్నయ్యా!

కథకుడు:

వినుడో పూజ్యులు! వీరయువకులు విప్లవ సహచరులు!
అన్నలార! నా తమ్ములార! నా ఆఖరి మాటలివె!
పరదేశీయుల పాలనుండీ భారతదేశమును
స్వాతంత్ర్య సుందర స్వేచ్ఛా భూమిగ సత్వరముగ జేయ
ప్రజలందఱును వీరయోధులుగ ప్రభంజనమువలెను
విదేశీయులను వెడలనంపుడో వీరయువకులారా!
పీడన లేని దోపిడి లేని పేదప్రజలు లేని
నవభారతమును నిర్మించండీ! నా సందేశమిదే!
మానవత్వము పూవులు పూసే మహో ప్రపంచమును
హెచ్చు తగ్గులు లేని సమాజం వచ్చుగాత ధరణి!
అసమానతలు లేని ధరిత్రి అవతరించుగాత!
ఇంటింటను దీపములు వెలుగుచు నింపు లెసగుగాత!
అరుగుచుంటినో యువకులార! నా యాశలు మీాయందే!
నా ఆశయముల నిజము సేయుడో! నవకిశోరులార!

అని యీవిధంగా శ్రీ సీతారామరాజు పలికి "వందే మాతర" మంటూ తన అసువులను విడిచాడురా తమ్ముడూ!

వంత: అయ్యో! పాపం! ఎంత పని జరిగింది!

కథకుడు: వినరా భారత వీరకుమారా! విజయము మనదేరా!

వందేమాతర మంటూ రాజు ప్రాణం విడిచాడు!
తళతళమంటు తార ఒక్కటీ ధరణి రాలినాది!
అంధకార బంధురమైపోయెను అన్ని దిక్కులందు!
పున్నమి చంద్రుని దుష్ట రాహువు పూర్తి చేసినటుల!
రామరాజును మింగివేసిరీ రాక్షస బలగంబు!
భారత ప్రజలు దుఃఖార్ణవమున పలవరించినారు!
మన్య ప్రజల విషాదము తెలుపగ మాటలు లేవు గదా!
అఖిలదేశ ప్రజ యశ్రువులోలికి అంజలులిచ్చారు!
ఏ ఆశయముల సాధనకొఱకై యిచ్చెను ప్రాణముల
ఆ ఆశయముల సాధించుటకై ఆత్మార్పణములతో
దేశగౌరవము నిలుపగ వలెనని ధీరులు పలికిరిగా!
పుష్పాంజలులను అశ్రుతర్పణము పూజ్యులు సలిపిరిగా!

ఈ విధంగా 1924 మే 7 వ తేదీని శ్రీ సీతారామ రాజును ఆంగ్ల ప్రభుత్వము కాల్చివేసింది. 8 వ తేదీని అతని భౌతిక దేహాన్ని కృష్ణదేవుపేటలో దహనం చేశారు.

శ్రీ సీతారామరాజు మరణించినా అతడు రగిలించిన విప్లవాగ్ని చల్లారలేదురా తమ్ముడూ! వీరుడు మరణింపడు! విప్లవానికి పరాజయంలేదు. చిందిన వీరునిరక్తము చిరకాలం ప్రవహిస్తూ వుంటుంది.

మనము ఈనాడు ఈ మాత్రము స్వాతంత్ర్యము అనుభవిస్తున్నామంటే శ్రీ సీతారామరాజువంటి విప్లవవీరుల ఆత్మార్పణవల్లనేరా తమ్ముడూ! భక్తి శ్రద్ధలతో ఆ మహా వీరునికి శ్రద్ధాంజలిని ఘటిద్దామురా తమ్ముడూ!

వంత: అలాగే అన్నయ్యా! ఆ మహావీరునికి నిండు భక్తితో శ్రద్ధాంజలిని ఘటిద్దాము.

జోహార్లు! జోహార్లు! అల్లూరి! — నీకు

జోహారు లివిగోను అల్లూరి! ||జోహారు||

పరదేశ ప్రభులతో నీవు సైసై
పట్టుదలతో నిలిచి పోరి ,,
స్వాతంత్ర్య జ్యోతి వెలిగించి ,,
సకల ప్రజలను మేలుకొలిపి ,,
ఆటుపోటుల మధ్య నిలిచి ,,
అసువు లర్పించినా నీకు ,,
అశ్రుతర్పణ మిదే అంజలులు నీ కివే!
అందుకొని మమ్ము దీవింపూ!

జోహార్లు జోహార్లు! అల్లూరి — నీకు

జోహారులివిగోను అల్లూరి! ||జోహారు||

నీ యాశయముల సాధింప! సైసై
నీ లక్ష్యములను నెలయింప! ,,
కూడు గుడ్డకు కొదవలేని ,,
క్రొత్త జీవనము వెలయింప ,,

ప్రతిన బూనితి మిదే! పిడికిలిని బిగియించి
భాగ్యరేఖలు దిశలు నిండా!
ఓ భారతీయుడా! ఓ వీరయోధుడా!
లేవయ్య! లేచి రావయ్యా!
పోయి వస్తామయ్య మేము సైసై
పోయి వస్తామమ్మ మేము ,,
మఱు వత్సరమునకు మఱల మే మొస్తాము
మన్నించి మము బంపరయ్యా!
ఓ భారతీయుడా! ఓ వీరయోధుడా!
లేవయ్యా! లేచి రావయ్యా!



# చిరంజీవులార!

చిరంజీవులార! ఓ
చిర సమాధులార!
మాతృ దాస్య ముక్తి కొఱకు
మరణించిన యోధులార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

స్వారాజ్యము సాధింపగ
సమరములో దూకినా!
రక్తమొలికి ప్రాణమొడ్డి
రాజిల్లిన యోధులార!

మీ కివె నివాళులు!
మీ కివె జోహారులు!

నిరంకుశుల నెదిరించిన
వీర యోధులార!
ఉరికంబము లెక్కినట్టి
ఉక్కు పిడుగులార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

తల్లి చెఱను విడిపింపగ
తరలి పోరి శత్రులతో!
వీర మరణ మొందినట్టి
వీర వనితలార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

మతకుల భేదములు లేని
మరో జగతి నిర్మింపగ!
పోరాటములో వారిగిన
పుణ్య పురుషులార!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

చిందించిన మీ రక్తము
చెఱిగిపోదు యీ నేలను!
మీ త్యాగములను మఱువము
మీ బలిదానము మఱువము!

మీ కివె జోహారులు!
మీ కివె నివాళులు!

# సమ భావం !

సమ భావం! సహోదరత్వం!
శాంతి! ప్రగతి! మా ధ్యేయం!

నవభారతమే! నవ సమాజమే!
నవజీవనమే మా లక్ష్యం! ...సమ

మత కుల భేదములను మాన్పి
మానవులంతా ఒకటే నంటు
సమ సమాజమును స్థాపిద్దాం!
సహోదరత్వం వెలయిద్దాం! ...సమ

అన్ని రంగముల అభ్యుదయమును
ఐకమత్యమును స్థాపిద్దాం!
సిరి సంపదలు! చిర సౌఖ్యములు!
చిందే దేశము నిర్మిద్దాం! ...సమ

దారిద్ర్యం, దీనత, అన్యాయం!
తరతరాల పీడనలను మాన్పి
శాంతి పథంలో పయనిద్దాం!
శాంతి పథంలో జీవిద్దాం! ...సమ

సమ భావం! సహోదరత్వం!
శాంతి! ప్రగతి! మా ధ్యేయం!
నవభారతమే! నవ సమాజమే
నవ జీవనమే మా ధ్యేయం!

